# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1958

సంపుటము 35 · . సంచిక 9

విడిప్రతి వెల ఒక రూపాయి

# అమృతాంజనము

...ఏనుగు తలనొప్పులనుకూడా

క్షణంలో ఉపశమింపచేస్తుంది



లక్షలాది ప్రజలు 1893 - నుండి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పక్కపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపచేస్తుంది

అమృతాంజనము

అన్ని నొప్పులకు

దివ్యామృతము






అమృతాంజన్ లిమిటెడ్

మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7

ప్రతి ఆదివారం రాత్రి 8-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాషలన్నింటిలో వెలువడే హాస్యపూరిత కళాకారుల ప్రోగ్రాము, అమృతాంజలి వినండి.

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

హరినీలస్థగితావనీతలమునం దందాలొందమ్మునై
వరబృందావనవాటికన్ వరమణీభాపేటికన్ దృశ్యమౌ
హరనానామణిమండపాగ్ర విబుధోద్యత్ తన్మయమూలమ్మునన్
బరమమ్మైన రయియారి మామక వచో మాత్రేభ సంచారిణిన్.

శిరమం దూగెడు కేకిపింఛియముతో, శైల్యై కనద్రత్నసుం
దర కోటీర విశుంభి తాగ్ర లలితోద్యత్కుంతలాక్రాంతమై
స్ఫురదానీల విలోలఫాలదలకస్ఫూర్జల్లలాటేందు సుం
దరమై, శ్రీ శరదిందు బింబరుచి చందం బొప్పు వక్త్రమ్మునన్.

దలదంభోజదళాళిలోచనము సుద్యత్పక్వ బింబాధరా
కలితస్మేర శుచిస్మితాకలిత తద్దంతావళీకాంతి సం
కులితాశాంబర, బిందుపాండురలసద్గండస్థలీలోలకుం
డలముల్ మాత్రిక మంజరీ మధుర కర్ణ శ్రీక సుశ్లోకముల్.

ఉరమై కుంద్రదళనమ్మున గలిగి మొంతో యొప్పు ముత్యాలహా
ర రుచిం గుల్కెడు కంఠదేశ మటుపై రమ్యేంద్రనీలావనీ
ధరరోచిర్జటితమ్ము చేయు వరమోదార ప్రభాపూర మ
వ్వరలక్ష్మీ శుభమందిరాయిత మహోవక్షఃస్థలాదీప్రముల్.

చరణాబ్జమ్ముల నావళిస్ఫురణ మక్రాంతంబు జీరాడుచున్
వరభోగీంద్ర సమానదోర్యుగముతో వాసించి వ్రేలాడుచున్
వరవస్త్రాప్రభము దట్టమై మెఱుపుదీపం దాల్చు చందంబు దో
వ్వరహీర్ ఫుల్లవనామలప్రవసము శోభల్ నించు సౌందర్యముల్.

మణిమత్కంకణ కాంతిమాంసలము, శుంభత్ఫుల్లపద్మారుణా
రుణ, మక్రాంతనఖాశ్రితోద్ధరణమై రూపించుహస్తద్వయిన్
గణుతిన్ రత్నమయాంగుళీయకవిధా కల్యాంగుళిన్ వేణు పూ
రణముం జేసి యశేష జీవుల మనోరాగప్రశుతుల్ గాంచుమన్.

ఉదరోద్యద్ద్యుతినిమ్నగాలహరిమై యొప్పారు నూగారు ను
న్మదగోపీ నయనానుకర్షణ సునిమ్నంబైన యన్నాభి యొ
ప్పిదమై బంగరు సీరువల్ దొలఁకు నాపీతాంబర శ్రీ ప్రభా
మృదులమ్ముల్ మఱి యూరువుల్ గులుకు నామేలైన సౌభాగ్యమున్.

లలిత శ్రీమణినూపుర శ్రుతిజటాలంబైన జంఘాయుగ
మ్మలఘుస్పర్థి ముఖస్థ దంతివరరత్నాగ్రైక జంఘాలమం
జుల జంఘాయుగ దివ్యవైభవమునై శోభిల్లు చిద్బింబమున్
కులిశమ్మంకుశమంబుజమ్ము మఱికింకున్ జక్రమున్ గేతన
మ్ములు రేకల్ గులుకంగ కోమలములై ముద్దుల్ పిసాళించు మం
జులముల్ పాదతలంబులుల్ జెలఁగు మేల్ సొంపుల్ నిగారింపునుల్
దొలఁకల్ బ్రహ్మశివాది దేవమకుట స్తోమాగ్రరత్నప్రభా
కలిత శ్రీనఖ చంద్రికావిదళిత క్షోణీజనక్షోభమై

చెలువౌ పాదయుగమ్మునుం గల కృపాశృంగారమాకారముల్
కలలో నిద్దురలోన మేల్కాలుపులో గన్గొందుగా కింటిలో
వెలి రాదారుల దారులం దదియ యోవిశ్వేశ! నీమూర్తి క
న్నులలోఁ గట్టిన యట్లు చిత్తమున నెంతో హత్తినట్లయ్యెడిన్.

నవఘన నీలిమద్యుతి కనన్నమనీయ మశేషవేదవి
భవకమనీయ మానొబఁగు పాపగతిం బడిపోవు నన్ను నం
భవ మిదియౌను గాదనక మక్కువ కన్నులనేని యబ్బి మా
నవ పరమాణువున్ నను సనాథుని జేయుచుగాక యిప్పుడే.

హరి! నీకుల్ ప్రణమిల్లి కోరెదనురా హా! అంజలింబట్టి నే
వరమీ యొక్కటిగాగ నొక్కటి ప్రభూ! వద్దెందునున్ జన్మ, మీ
శ్వర! పుట్టింతువా భూమి దున్నకొను వవ్వారింటఁ బుట్టింపు సుం
దర గోవిందపదారవింద మధుమత్తంబైన చిత్తమ్ముతో

అమృతస్యంది వచోవిలాసమును నావందించినా వైన! స్వ
ప్నమునం దైనఁ దలంప నీకృప యహంభావాన సిగ్గింతలే,
దమిత మ్మీయపరాధమున్ గవక నన్నాత్మీయుగా గొన్న నీ
కు మరేదీ దయసాటి? మత్తులను, నాకుల్ సాటి యేదీ ప్రభూ!

## కరుణాలహరి

పాతాళంబున-కేగుమా సురపురిన్ పాలింపుమా మేరువున్
వాతూలోద్గతి నెక్కుమా జలధులన్ బాహూద్వయిన్ దాటుమా
చేతన్నస్తములైన యాశలవి నిశ్శేషమ్ముగా వీడవో
భూతవ్యాధిజరాజ్వరాహత! సుఖంబున్ గోరి తేనిన్ మదిన్,
ప్రీతిం గృష్ణరసాయనమ్ము గొనుమా! వేరే శ్రమ మ్మేటికిన్

పాపమహీధరమ్ములకు వజ్రము, జన్మ రుజాభిభూత సం
తాప సుసిద్ధభేషజము, 'దంభ' తమఃపటలార్క బింబమున్
వ్యాపృత దుఃఖభూరుహ దవాగ్నికలాపము! 'కృష్ణ' నామమీ
శా! పరనిర్వృతి ప్రకట సాధకపాటము వొల్పు నున్నతిన్

ఘనవిషయాటవీ శిఖ శిఖావితతిన్ వికలత్వ మొందినా
మన మిటు మాధురీ పరమ మందిరమందు ముకుంద ముగ్ధ మో
హనవదనేందుబింబమున నంచిత చారు చకోరవృత్తి చే
ననిమిషభావ మొంది యమృతాప్లుతమై విలసిల్లుఁ గావుతన్

అమరతరంగిణీ పులినమందు సుఖాసనముండి కన్నులం
దమరిచి యోగముద్ర, విషయమ్ము లడగ్చి, హరించిలోని సం
తమసము సత్సుఖాత్మక సుధారస నిర్ఝరి నన్నవాంబుదో
త్తమరుచిఁ జిక్కఁగన్ మునిఁగి ధన్యుఁడ నౌటది యెన్నఁడో సదా!!

# వసంతరాజీయము

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు

'వసంతరాజీయము' రెడ్డిరాజగు 'కుమారగిరి' చే (క్రీ. శ. 1386-1402) రచింపబడిన నాట్యశాస్త్రగ్రంథము. ఈ కుమారగిరిరెడ్డికి 'వసంతరాయలు', 'కర్పూరవసంతరాయలు' అను బిరుదులు కలవు. ఈ బిరుదులను బట్టియే ఆతని నాట్యశాస్త్రము 'వసంతరాజీయ' మనబడెను.

ఈ వసంతరాజీయము గ్రంథ మంతయును లభింపకపోవుట ఆంధ్రుల దురదృష్ట మని చెప్పక తప్పదు. ఈ గ్రంథమునుండి ఆయా వ్యాఖ్యాతలు తమ తమ వ్యాఖ్యానములందు ఉదాహరించిన లక్షణ శ్లోకములను బట్టి దీని స్వరూపమును మాత్రము కొంత యూహించుటకు వీలగుచున్నది.

'వసంతరాజీయ' మను పేర శ్రీ విడుదల వేంకటరావుగారు 'భారతి' స్మారక సంచికలో ఒక ఆంగ్లవ్యాసమును ప్రకటించినారు. ఆ వ్యాసమునందు రెడ్డిరాజుల చరిత్ర వివరింపబడినది; అంతమున మాత్రము వసంతరాజీయమందలి తొమ్మిది శ్లోకములు ఉదాహరింపబడినవి. శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు కూడ తమ 'సంస్కృతవాఙ్మయ చరిత్ర'లో ఈ శ్లోకములనే ఉదాహరించియున్నారు.

ఇప్పుడు నే నింకను చాల శ్లోకములను సేకరించినాను. వానిని సహృదయుల పరిశీలనార్థము నివేదించుటకే ఈ నా ప్రయత్నము.

వసంతరాజీయ శ్లోకములను తమ తమ వ్యాఖ్యానములం దుదహరించిన వారిలో కాటయవేముడు ముఖ్యుడు. కాటయవేముడు కుమారగిరియొక్క బావమరది. ఇతడు కాళిదాస ప్రణీతము లగు మూడు నాటకములకును 'కుమారగిరి రాజీయము' అను పేర వ్యాఖ్యలను రచించెను. వసంతరాజీయశ్లోకములను పేర్కొనిన రెండవ వ్యాఖ్యాత తిమ్మయను పేనల్లంపెళ్ళ వాడెంపల్లి గోపమంత్రి. ఇతడు కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు 'చంద్రిక' అను వ్యాఖ్యను రచించెను. వ్యాఖ్యాతృచక్రవర్తి యగు మల్లినాథసూరి శిశుపాలవధవ్యాఖ్యలోను, వాని కుమారుడగు కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్యలోను వసంతరాజీయమునుండి చెరి రెండు శ్లోకములను పేర్కొనియున్నారు. నేను చూచినవి ఇవి మాత్రమే. ఇంకను ఎందఱు వ్యాఖ్యాతలు వసంతరాజీయ శ్లోకములను పేర్కొనిరో తెలియదు. పరిశోధకు లింకను పరిశీలింపవలసియున్నది.

నేను పరిశీలించిన పై వ్యాఖ్య లన్నియును ముద్రితములే. వాని వివరముల నీ క్రింద నొసంగుచున్నాను.

1 కాటయవేముని అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్య—దీనిని శ్రీ వి. శంకరరామశాస్త్రిగారు ప్రకటించినారు. (అభిజ్ఞాన శాకుంతలము—బాలమనోరమా ప్రెస్, మద్రాసు, 1947)

2 కాటయవేముని మాలవికాగ్నిమిత్రవ్యాఖ్య—దీనిని శ్రీ ఎమ్. ఆర్. కాలేగారు ప్రకటించినారు. (మాలవికాగ్నిమిత్రము— గోపాల్ నారాయణ్ అండు కో, బొంబాయి, 1933).

3. కాటయవేముని విక్రమోర్వశీయవ్యాఖ్య—దీనిని శ్రీ చారుదేవశాస్త్రిగారు ప్రకటించినారు. (లాహోరు, 1929)

[పై వ్యాఖ్యలను మఱికొందఱు కూడ ప్రకటించినారట. అవి నాకు లభ్యము కాలేదు ]

4 గోపమంత్రి ప్రబోధచంద్రోదయవ్యాఖ్య—దీనిని శ్రీ వాసుదేవశర్మగారు పరిష్కరించినారు. (ప్రబోధచంద్రోదయము—నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి, 1938)

5. మల్లినాథసూరి శిశుపాలవధ వ్యాఖ్య—(శిశుపాలవధము — నిర్ణయసాగర ముద్రణాలయము, 1917).

6. కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్య—దీనిని శ్రీ కె. పి. త్రివేది ప్రకటించెను. (ప్రతాపరుద్రీయము—బొంబాయి, 1909).

జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభోః
సకలకలనా దేవీ యస్య శ్రియా సదృశీ ప్రియా
వద మధి వచనం నాట్యార్థానాం వినోద సదా
ప్రథా
వితరతి బహూన్ కర్తుం బద్ధి ప్రజాయ సహస్రశః

—('రెడ్డి సంచిక'—పుట—304, శ్రీ వేటూరివారి శృంగారశ్రీనాథము — పుట—57 కూడ చూడ వలెను)

"ఏ కుమారగిరి ప్రభువుయొక్క సిరితో సదృశు రాలగు లకుమాదేవి వధిలలో నాట్యశాస్త్రోక్తములగు వేలకొలది నూతనాభినయములను చేయుచున్నదో అర్థి బృందమునకు వేలకొలది ధనములను దానము చేయుచున్నదో ఆకుమారగిరి ప్రభుని మహిమ లోకాతీతమై వర్ధిల్లుచున్నది."

ఈ కుమారగిరిప్రభువు భరతాదుల నాట్యశాస్త్రములను చక్కగా పరిశీలించి వసంతరాజీయమును వ్రాసెననియు, ఆ వసంతరాజీయము ననుసరించి తాను కాళిదాస నాటకత్రయమునకు వ్యాఖ్యలను రచించు చున్నట్లును కాటయవేముడు చెప్పుకొనెను

మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినామ్
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం
యదుత్తమమ్॥
తత్రోక్తేనైవ మార్గేణ చర్చితా నేవ లక్షణమ్
కవితా మాత్రయా మంత్రీ కాటభూపతిమాన్యః
ప్రౌఢానాం వేమవిభుః కుమారగిరిణా రాజ్ఞా
వినయకృతకృతీ
నాట్యానాం త్రితయం కృతం కృతధియా
శ్రీ కాళిదాసేన యత్
తస్యోద్దీర్ఘరహార్థతత్త్వరసికః కాటంతిలా దేవ్యయమ్
వ్యాఖ్యానం కురుతే కుమారగిరిరాజీయాఖ్య
మన్వాహితమ్

—(చూ. 'రెడ్డి సంచిక'—పుట 303)

"నాట్యవేదార్థ విదులైన భరతాదిమునులయు, భోజాది భూపతులయు శాస్త్రములను చక్కగా పరిశీలించి 'వసంతరాజు' అనబడెడి కుమారగిరిభూపతి 'వసంత రాజీయ' మనెడి ఉత్తమ నాట్యశాస్త్రమును రచించెను. అందు చెప్పబడిన మార్గము ననుసరించియే రాజాజ్ఞానుసారముగా, కాటయవేముడు, ప్రజ్ఞాశాలియైన కాళిదాసుచే రచింపబడిన రసనిధులగు మూడు నాటకములకును 'కుమారగిరిరాజీయము' అను పేర వ్యాఖ్యానమును చేయుచున్నాడు."

కాటయవేముడు మొట్టమొదట శాకుంతల వ్యాఖ్య ను రచించినట్లు కన్పట్టుచున్నది. అందలి లక్ష్యము లెల్ల లక్షణశ్లోకముల పేర్కొని యుండెను. కాని మాళవికాగ్నిమిత్రమందు "నాంద్యాదిలక్షణంతు శాకుంతల వ్యాఖ్యాన ఏవాభిహితం" (నాంద్యాదుల లక్షణము లెల్ల శాకుంతల వ్యాఖ్యానమందే చెప్పబడినవి) అని వచించెను. అందుచేత శాకుంతల వ్యాఖ్యమొదటి దియును, మాళవికాగ్నిమిత్రవ్యాఖ్య రెండవదియును అగుచున్నది. దీని తరువాత విక్రమోర్వశీయ వ్యాఖ్యను రచించియుండును

కాటయవేముని వ్యాఖ్యలందు నాట్యశాస్త్రము నకు సంబంధించిన అనేక లక్షణ శ్లోకములు ఉదా హృతములైనవి వానిలో కొన్ని శ్లోకములకు మాత్రమే 'యథోక్తం వసంత రాజీయే', 'తథాచోక్తం వసంత రాజీయే', 'తదుక్తం వసంతరాజీయే', 'తల్లక్షణంతు వసంతరాజీయే' అని స్పష్టముగా నున్నది. కాబట్టి ఇట్లు చెప్పబడిన శ్లోకము లన్నియును వసంతరాజీయము లోనివి అనుట నిర్వివాదము. ఇంక తక్కిన శ్లోకము లెచ్చ టనో చెప్పబడలేదు; ఆశ్లోకములలో కొన్నింటికిముందు 'తదుక్తం' 'యథోక్తం', 'తథాచోక్తం' 'తథో క్తం' అనియు, కొన్నింటికి వెనుక 'ఇత్యుక్తత్వాత్', 'ఇత్యుక్తేః', 'ఇతి' అనియు కలవు. ఆ శ్లోకములు కూడ వసంతరాజీయములోనివే యని నేను సకారణ ముగా ప్రతిపాదించుచున్నాను

నాట్యశాస్త్రేతర విషయములకు లక్షణ శ్లోకము లను ఉదాహరించు నప్పుడు కాటయవేముడు ఆగ్రంథ నామమును కాని, తద్గ్రంథకర్తృనామమును కాని తప్పక పేర్కొనినాడు. ఉదా — యథాచోక్తం 'త్రిపురారాజ సింధౌ' "అరవింద మశోకంచ శిరీషం చూతమల్లికమ్ పంచైతాని ప్రకీర్త్యంతే పంచబాణస్య సాయకాః." (శాకుంతల వ్యాఖ్య - పుట 144). ఎచ్చటను పేరు చెప్పకయే ఉదాహరించిన శ్లోకములు వసంతరాజీయ మందలివి కాక ఇతర గ్రంథములందలివి

[కోహాల సాహిత్యపరిషత్తులోని ప్రాత ప్రతియందుగు ప్రవేశలక్షణమునకుముందు 'తల్లక్షణంతు వసంతరాజీయే' అని ఉన్నది; కావున ఇది వసంత రాజీయములోనిది అనుట స్పష్టము. ఆ ప్రాతప్రతియందు ప్రవేశక లక్షణము "అంకయో రన్తర విజ్ఞేయ స్త్రీ ద నీచపాత్ర ప్రయోజితః। నిష్క్రాంథ ఏవ శాబ్దైః ప్రవేశక ఇతి స్మృతః" అని ఉన్నట్లు కుత్ర అట్లు అద్భుత లేక పోయినను ఉన్నదిగా ఉండుట భయుంటవను]

నీచపాత్రాంతిః స్త్రీభిః పాత్రైః ద లిఖార్థః సూచనా।
నిష్క్రం భూతేషు చాంతే వా ప్రయోగో ఽపో
ప్రవేశకః॥ 23

—(శా వ్యాఖ్య పుటలు 84,77)

అంకాంతపాత్రైరంకాస్య ముత్తరాంకార్థ
సూచనా।

—(శా వ్యాఖ్య. పుట 110)

[అర్థోపక్షేపకములను నిరూపించిన పై శ్లోకము లన్నియును ఇంచుమించుగా వరుస శ్లోకములు (continuous verses) -ని మున్నులో ప్రవేశకలక్షణము వసంత రాజీయము లోనిదైనప్పుడు తక్కినవి కూడ వసంతరాజీయములోనివే అని తలంచుట అసమంజసము కాదు ]

## ఆకాశభాషితము

అప్రవిష్టైర్య ఆలాపః స ఏవాకాశభాషితమ్॥ 24
ఏవ ప్రయోజ్య ఆకాశే లక్ష్యం బద్ధ్వా
త్వనంతరమ్।
కిం బ్రవీషీతి యత్రోఽనూద్య పశ్చాత్కార్యం
తదుత్తరమ్॥ 25

(శా వ్యాఖ్యా. పుట 61)

## అంకము

అంకో బీజబిందు సమన్వితః ।

(శా వ్యాఖ్య పుటలు 40; 59)

పంచాది దశపర్యంతమంకాః కార్యానుబంధో
చితమ్॥ 26

(శా వ్యాఖ్య పుట 8)

. . శేషా అంకే చ విగ్రహః (శేషాః=
అంకములు) ।

(శా. వ్యాఖ్య. పుట. 86)



## పతాకాస్థానకము

* పతాకాస్థానకం ప్రాహుః ర్భావినోఽర్థస్య
సూచనమ్॥ 27
చతుర్భిః కారణైరేవ చతుర్ధా పరికీర్తితమ్।
* సహసైవార్థసంపత్యా విపర్యాసనివిష్టయాత్॥ 28
తుల్యేన సం విధానేన తథా తుల్య విశేషణాత్।

(శా వ్యాఖ్య పుట 9)

[ముద్రిత ప్రతియందును, ప్రాతప్రతియందును కూడ 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు ముద్రింపబడిన ప్రతిలో 104 వ పుటలో ఈ శ్లోకములు మరల ఉదాహృతములైనవి కాని అచ్చట 'తథోక్తం' అని మాత్రమే ఉన్నది, ఇది పొరపాటు అయి యుండును ఇవి రెండును వసంతరాజీయము లోనివే అనుట స్పష్టము ]

## ఆత్మగతాదులు

అశ్రావ్యం నియతశ్రావ్య మావశ్య
మితి త్రిధా ॥ 29
అశ్రావ్యమస్తైర్యదస్తేత మాత్మగత్యేవ స్థితం విదుః ।
తదాత్మగత మిత్యుక్త్వా నాట్యజ్ఞం
నివేశయేత్ ॥ 30
* అన్యైస్త్వేకత నిర్దిష్టో నియతశ్రావ్య ఇష్యతే ।
ద్విరూపః సపరిక్షేపో జనాంతః ప్రపవారితమ్॥ 31
ను హస్తత్రిపతాకేన కృతో జనాంతో
ద్విధో మతః ।
పార్శ్వజనాంతిక మిత్యుక్త్వా వాద్యః పూర్వ
స్తథాపరః ॥ 32
రస్తు ఏక మిత్యుక్త్వా శ్రావ్యః సర్వప్రకాశతః।
సర్వే శ్రాకర్ణనీయాస్తు ప్రాశ్య ఇత్యభిధీయతే ॥ 33
ఏతం ప్రకాశ మిత్యుక్త్వా తదాకారం తే ప్రయో
జయేత్।

—(శా. వ్యాఖ్య-పుటలు-32 33.)

[“అన్యైస్త్వేక . జనాంతర్వ్యపవారితః” అను శ్లోకములకు ముందు మాలికాన్ని ముద్రితవ్యాఖ్యలో 'యథోక్తం వసంతరాజీయే' అనియున్నది (పుట 26) కావున ఇది వసంతరాజీయములోనిదనుట స్పష్టము. పై శ్లోకములు ఇంచుమించుగా వరుస శ్లోకములు.

* కులజాం గణికాం ప్రేష్యాం యథాశాస్త్రం విచేష్టితైః।
రాగాతిశయసంపన్నాం వర్ణయేదభిసారికాం॥ 51
—(విక్ర. ఊర్వ. వ్యాఖ్య-పుట. 60)

[ఈ శ్లోకములకుముందు 'అభిసారికా లక్షణముక్తం వసంతరాజీయే యథా' అని కలదు. కావున ఇవి వసంత రాజీయములోని వనుట స్పష్టము. మొదటి శ్లోకమును శ్రీ వేంకటరామయ్యగారు పేర్కొనియున్నారు.]

## వేశ్యానాయిక

వేశ్యాచేన్నాయికా రాజ్ఞః పాదివాక్య పాఠ్య స్వ
మాషుకీ।
—(విక్ర. వ్యాఖ్య-పుట-18)

[ఈ శ్లోకపాదమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయములోని దనుట స్పష్టము. ఈ శ్లోకార్థమును సమర్థించు 'శకార భారతీయే' అని చెప్పి భంగుని నాట్యశాస్త్రములోని శ్లోకములను కొన్నింటిని కాటయవేముడు ఉదాహరించియున్నాడు.]

## కుపితనాయికల ననునయించు నుపాయములు

* సామ్నా దానేన భేదేన నత్యుపేక్షారసాంతరైః॥ 52
మానాపనయనం కామీ హ్యుపాయైః షడ్భిరాచరేత్।
—(విక్ర ఊర్వ వ్యాఖ్య పుట 49)

ఈ శ్లోకమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయము లోని దనుట స్పష్టము]

## నృత్తారంభోచితావస్థానము

* అంగన్యస్త చతుర్ప్రత్యం సమపాదాలతాకరా॥ 53
ఆరంభే సర్వనృత్తానాం తిష్ఠేత్తాన్యకమిష్యతే।
—(మాల. అగ్ని. వ్యాఖ్య—పుట 26)

[ఈ శ్లోకమునకు ముందు 'తథాచోక్తం వసంత రాజీయే' అని కలదు కావున ఇది వసంతరాజీయ ములోనిదే అనుట స్పష్టము.]

## కపోత హస్తము

కపోతః ప్రాంతసంశ్లేషా దన్యోన్యస్య సర్వ
తోర్థయోః॥ 54
—(శా. వ్యాఖ్య పుట 144)

## నైపథ్య భేదములు

(చతుర్విధాహార్యాభినయములు)—
పుస్తం ప్రదర్శితం శాస్త్రే విధానాత్రి ప్రకారతః।
మండలాది విధూషాంగరచనా త్వలంకరణమ్॥ 55
సంజీవః పశుపక్ష్యాది ప్రాణినాం రూపధారణమ్।
—(శా. వ్యాఖ్య-పుట. 8)

## విషవేగములు

* వైవర్ణ్యం వేపథుర్దాహః ఫేనః స్కంధస్య
భంజనం॥ 56
దుఃఖం జాడ్యం మృతిశ్చేతి విషవేగాః క్రమాదష్టధా।
—(మాల. అగ్ని. వ్యాఖ్య-పుట. 69)

[ఈ శ్లోకమునకు ముందు 'విషవేగాస్తు వసంత రాజీయే కథితాః' అని కలదు. కావున ఇది వసంత రాజీయములోనిదే]

## అధర భేదములు

* వివర్తితో వికంపిత విసృతశ్చ వినిగూహితః॥ 57
ఆయతో రేచితోత్కృష్టః సందష్టశ్చ సముద్గకః।
* కంపితశ్చేతి నాట్యజ్ఞై రధరో దశధామతః॥ 58
తత్ర –
* ప్రసారితో విసృష్టాఖ్యో ఒచ్ఛాదకో దర్శితాగ్రణః।
(శా వ్యాఖ్య పుట - 155)

[ఈ శ్లోకములకు ముందు 'యథోక్తం వసంత రాజీయే' అని కలదు కావున ఇవి వసంత రాజీయ ములోనివి]

## ధ్రువా భేదములు

* సూచకే పాత్రభేదానాం తత్స్వభావాది సూచనే॥
యా గీతిః సా ధ్రువా తుల్యసంవిధాన విశేషణే।
* ప్రావేశికీ క్షైపికీ చ తథా ప్రాసాదికీ చ॥ 60
నైష్క్రామికీ తథాంతరేతి తాసాం లక్షణముచ్యతే।
* ప్రవేశ సూచకే గానే ధ్రువా ప్రావేశికీ మతా॥ 61
ప్రసంగముద్దేశ్యార్థస్య తేషాం క్షేపికీ మతా।
* ప్రాసాదికీ పాత్రాణాం వ్యాకులానాం ప్రసా
దనాత్॥ 62
నిష్క్రామము సూచికాయాం తే ధ్రువా నైష్క్రామికీ
భవేత్।
* విషాదే విస్మృతే క్రోధే ప్రమాదే సంభ్రమే మదే॥ 63

దేవప్రత్యాసనాదౌ చ గీయతే యాతు సాంతికీ
—(ప్రబోధ దం వ్యాఖ్య-పుట-101)

['తిథ్యోక్తం వసంతరాజీయే' అని పేర్కొని పైశ్లోకములను గోపరుంద్రి ఉదాహరించెను. కావున, ఇది వసంతరాజీయమందలిదే అనుట స్పష్టము. శాకుంతల వ్యాఖ్యలో కూడ కాటయవేము డీ శ్లోకముల నుదాహరించెను. (పుట-112) కాని, అచ్చట 'తిథ్యోక్తం' అనిమాత్రమే కలదు. ఇది పొరపాటు. ఈ రెండింటికి పాఠభేదములుకూడ నున్నవి. కాటయవేముని పాఠము నే సరియైనదానినిగా గ్రహించుట సముచిత మగును. ఈ శ్లోకములను శ్రీ విదురపోలు వేంకటరావు గారు పేర్కొనియున్నారు.]

## కార్యావస్థలు

ఆరంభయత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః॥ 64
ఔత్సుక్య మాత్ర మారంభః ఫలలాభాయ భూయసే।
—(శా వ్యాఖ్య పుట-17)

ప్రయత్నస్తు ఫలప్రాప్తౌ ప్రవర్తన ముపాయతః॥ 65
—(శా. వ్యాఖ్య-పుట. 48)

ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశా కార్య సంభవః। —(శా వ్యాఖ్య పుట. 82)

అపాయాభావతః ప్రాప్తి ర్నియతాప్తిః సునిశ్చితా॥ 66
—(శా. వ్యాఖ్య పుట. 158)

## అర్థ ప్రకృతులు

స్తోకోద్దిష్టః కార్యహేతో ర్బీజం విస్తార్యనేకధా।
—(శా. వ్యాఖ్య. పుట 15)

వస్తునః పరివిచ్ఛేదే బిందు రచ్ఛేద కారణమ్॥ 67
—(శా. వ్యాఖ్య పుటలు-36; 79)

పతాకా సంధవే బీజం బిందునా విన్యసేత్ సుధీః।
—(శా వ్యాఖ్య పుట-84)

కథాంతర ప్రసంగేన ప్రకరీ స్యాత్ ప్రదేశభాక్॥ 68
—(శా వ్యాఖ్య పుట-141)

కార్యం త్రివర్గ స్తచ్ఛుద్ధమేకానేకానుబంధి చ।
—(శా వ్యాఖ్య పుట-196)

## ముఖసంధ్యంగ లక్షణములు

[సంధి, సంధ్యంగ లక్షణముల నెల్ల శాకుంతల వ్యాఖ్యనుండియే గ్రహించితిని. లక్షణముల చివర ముందలికరణములందు పుటల సంఖ్యల నొసంగియున్నాను ]

బీజన్యాస ముపక్షేపః (పుట 19), తద్బాహుళ్యం పరిక్రియా (పుట 19)॥ 69

తస్యదార్ఢ్యం పరిన్యాసః(పుట 25), గుణాఖ్యానా ద్విలోభనమ్(పుట 26)।

యుక్తిః సంశయితార్థస్య నిర్ణయః పరికీర్తితః (పుట 28)॥ 70

అర్థానా మానుకూల్యేన సుఖాప్తిః ప్రాప్తి రిష్యతే (పుట 33)।

యద్బీజస్యానుసంధానం తత్సమాధాన మిష్యతే పుట 35॥ 71

సుఖదుఃఖ విధానం యద్విధానం పరికీర్తితమ్ (పుట 37)।

పరిభావ ఇతి ప్రాహు రద్భుతార్థస్య దర్శనమ్ (పుట 37)॥ 72

ఉద్భేదః సపరిజ్ఞేయో యత్తు గూఢార్థ భేదనమ్ (పుట 38)।

కరణం ప్రకృతారంభః(పుట 30), భేదః ప్రోత్సాహనా ధికేత్ (పుట 30)॥ 73

## సంధ్యంగక్రమత్యాగము—

యథోచితం ప్రయోగః స్యాదంగానాం నక్రమో మతః (పుట 25)।

## ప్రతిముఖ సంధిలక్షణము—

లక్ష్యాలక్ష్య స్తదుద్భేదో యత్ర ప్రతిముఖం తత్ (పుట 43)॥ 74

## ప్రతిముఖ సంధ్యంగములు—13

విలాసః-పరిసర్పశ్చ-విధూతం శమ-నర్మణీ।
నర్మద్యుతిః-ప్రగమనం-నిరోధః-పర్యుపాసనమ్॥ 75
వజ్రం-పుష్పం-పరిన్యాసో-వర్ణసంహార ఇత్యపి(పుట48)

## ప్రతిముఖసంధ్యంగ లక్షణములు

ఇష్టార్థవిషయా హ్యీహా విలాస ఇతి కథ్యతే (పుట 50)॥ 76

పరిసర్ప ఇతి ప్రాహు ర్దృష్టవస్త్వనుసర్పణమ్ (పుట-63)
విధూతమరతిః (పుట 62) తచ్ఛాంతిః శమ ఇత్యభిధీయతే (పుట 67)॥ 77

# వసంతరాజీయము

తెలుగుదేశపు వాఙ్మయ మూలలను సరిగా గాలించితే 'వసంత రాజీయము'యొక్క వ్రాతప్రతులు తప్పక లభించగలవని ఆశించుచున్నాము. అవకాశము లున్నవారికి ఆసక్తిలేదు, ఆసక్తి కలవారికి అవకాశములులేవు. ఇదీ నేటి పరిస్థితి లభించని వసంత రాజీయము మాట ఎట్లున్నను, లభించిన కొలది పేజీలను వ్యాఖ్యలతోనైనను నిర్దుష్టముగా పరిష్కరించి ప్రకటించుటకు తెలుగుదేశమున ప్రయత్నమే జరుగలేదు ఇంక జాయపసేనాపతి 'నృత్తరత్నావళి' ఇంతవరకును అముద్రితముగానే ఉండుట ఆంధ్రుల కళాభిమాన సహృదయులు డా. వి. రాఘవన్ గారు దీని సంపాదకత్వమును వహించి, జూలై, 1966 లో మదరాసు 300 పేజీలను ముద్రించినారు. కాని, ఇది నేటివరకును ప్రకటితము కాలేదు, ఏమైనదో తెలియదు. తెలుగువారికి గర్వకారణములైన ఇట్టి అమూల్యగ్రంథములను వెలుగులోనికి తెచ్చుటకు పూనుకొనుట సహృదయులైన పెద్దల, ముఖ్యముగా సాహిత్య, సంగీత నాటక అకాడమీలలోని కవి, పండితుల కనీసకర్తవ్యము. ఈ వ్యాసమును చదివి సలహాల నొసంగిన శ్రీ మాన్ ఎస్. టి. రామానుజాచార్యుల గారికి కృతజ్ఞుడను.

# అంతర్వాహిని

**'హితశ్రీ'**

* గత సంచిక తరవాయి *

## 4

వాకిటో జట్కా బండి ఆగిన చప్పుడు విని గోపీ పరుగెత్తుకొచ్చి గేటుతలుపు తీసి సంతోషంగా కేక పెట్టాడు

"అన్నయ్యొచ్చాడమ్మా"

విశ్వం చిరునవ్వుతో వాడివైపు చూసి "ఏరా గోపీ, కులాసాగా ఉన్నావా?" అన్నాడు.

గోపీ తల ఆడించాడు ఆనందంగా. విశ్వం వచ్చేసరికి వరసగా అందరూ ఇంట్లోంచి బయటి కొస్తున్నారు.

"ఏరా విశ్వం, పరీక్షలన్నీ బాగా రాశావా?" అన్నారు రంగనాథంగారు

"ఆ: సెకండ్ క్లాస్ తప్పక వస్తుంది"

"అదేమిటిరా, అలా సగమైపోయావు? పాడు పరీక్షలు." అంది విశ్వం తల్లి

"ఇంక పరీక్షల గొడవ లేదుగా" అంది పద్మ

"ఓహో పద్మావతమ్మగారా? నీతో పాటే నేనా హిందీ పరీక్షలకు కూచోకుండా ఉంటానా?"

"హిందీ పరీక్షలకు లేకపోతే డ్రాయింగ్ పరీక్షలకూడా కూచో, నాదేం పోయింది మధ్య?"

"థాంక్స్ పర్మిషన్ ఇచ్చావుగద."

చిరునవ్వుతో లోపలికొచ్చాడు విశ్వం హాలో శ్రీనివాసరావు రేడియో వింటూ కూర్చున్నాడు.

"ఓ. డాక్టరుగారా! నమస్తే"

"హలో బ్రదర్ విశ్వం" వాల్యూం తగ్గిస్తూ అన్నాడు శ్రీనివాసరావు.

మా ఇంట్లో మాకు మర్యాద చెయ్యక్కర్లేదులే"

"ఎవరిల్లయితే ఏం, బంధువు బంధువే"

"డాక్టర్ గారికి మందులసంగతికంటే మర్యాదల సంగతే బాగా తెలుసల్లే ఉంది"

"మన తెలుగుదేశంలో కొత్తగా పెళ్ళయిన వాడికి ముందు ముఖ్యంగా తెలిసేది అదేగా!"

ఇద్దరూ నవ్వారు

"పండక్కి రావటానికి కుదరదేమో నని రాశావుటగా ఎలా వీలయింది?"

"పండక్కి రాకపోతే చాలా కష్టపడాలిసొస్తుం దని చుట్టపక్కాలు సలహా ఇచ్చార్లే—అందువల్ల వీలయింది" అన్నాడు శ్రీనివాసరావు ఓరగా పద్మ వైపుచూసి పద్మ ఇదేమీ వినబడనట్టు దొంగ వేషంవేసి లోపలికి జారుకుంది

"ఏమిటి గిరాకీ?" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"గ్లాసోపంచేలా మొదలైనా పంపక తప్పించి మరీ వొచ్చావు ఏమిటో కారణం?"

విశ్వం జరిగిన సంగతిచెప్పాడు ఇంతలోకే గోపీ వొచ్చి "అన్నయ్యా, స్నానంచేసి వొస్తే అమ్మ కాఫీ ఇస్తుందట" అన్నాడు "రేడియో వింటు న్నట్టున్నావు నిన్ను ఇబ్బందిపెట్టనులే కాసేపాగి పునర్దర్శనం చేసుకుంటాను" అని విశ్వం లేచినుంచు న్నాడు. "నేనూ అలా కాసేపు బయటికి వెళ్లొస్తాలే మధ్యాహ్నం తీరిగ్గా ఒకళ్ల నొకళ్లం విసిగించుకోవచ్చు" అని శ్రీనివాసరావు బయటికి నడిచాడు.

విశ్వం స్నానంచేసి, కాఫీ తాగి పేపర్ ముందు పెట్టుకుని వార్తల శీర్షికలు చూస్తున్నాడు గోపీ అతనికి దగ్గిర్లోనే చాప వేసుకు కూర్చుని లెక్కలు చేసుకుం టున్నాడు

"గోపీ, బావేడీ?"

పద్మ కంఠం విని విశ్వం తలెత్తాడు.

"బజారుకి వెళ్లాడు" చెప్పాడు గోపీ.

"ఎందుకూ?"

"ఏమో?"

"ఏమో" ఏమిట్రా? ఏమైనా కావాలేమో, నేను తెచ్చిపెడతానుకదా అనకూడదూ? ధర్మ శారం చదువుకున్నావు గాని "

"అయితే వాడు అంత చదువుకున్నాడు కదా, అడక్కుండా తనే చెప్పకూడదా? ఏమిటక్కయ్యా?"

గోపీ ఎదురు ప్రశ్నకి విశ్వానికి నవ్వొచ్చింది.

"డాక్టర్ గారికి కోపం వొచ్చింది" అన్నాడతను

"కోపమా!" అంది పద్మ తెల్లబోయి

"అవును అంటే ఆగ్రహం."

"ఎందుకూ?" కొంచెం కంగారుగా అంది

"కాఫీ ఇవ్వలేదని"

"ఎందుకివ్వలేదు ఇప్పుడేగా ఇచ్చిన దాన్ని"

"అయితే ఏమీ తోచక ఇంకోసారి కాఫీ తాగి రావటానికి బజారుకి వెళ్లి ఉంటాడు"

పద్మ గ్రహించింది

"[illegible] నిజమేనేమోనని హడలిపోయాను"

"ఎందుకంతభయం?"

"భయం కాదటే!?"

"మరి హడలిపోయానన్నావేం!?"

"మాటవరసకి అన్నాను"

"దాస్తావేం? పద్మా, నిజం చెప్పాలంటే ఈ ఆడవాళ్ళకి బుద్ధిలేదు మొదట మొదట నేర్పుకొన్నా తరువాత ఏమైనా ఊరుకుంటుంది ప్రతి చిన్నదానికీ భర్తగారికి కోపం వస్తుందేమోనని కంగారుపడిపోతారు. చివరికి అదే అలవాటైపోతుంది ముందు జాగ్రత్తకి చెబుతున్నాను స్వాతంత్ర్యపోరాటాలు పోయాయి. ఈ రోజుల్లో కావాలసింది అన్నిరంగాల్లో అందరికీ సమాన హక్కులు. సమతారాజ్యస్థాపన జరగాలంటే ఎవరి హక్కులు వాళ్లు తెలుసుకుని అవి సిద్ధించేవరకూ విశ్రమించకూడదు. ఈ చివరిమాటలు నావికావులే ఇదిగో, ఈ మూల మహిళా మహోద్యమసంఘ వార్షిక సభలో ప్రసంగవిశేషాలు చూడు."

గంభీరంగా ప్రారంభించి వ్యంగ్యోక్తితో ముగించిన విశ్వంవైపు బిత్తరపోయి చూసింది పద్మ.

"ఏమిటన్నయ్యా ఈ గొడవ, భలేవాడివంటే" అంటూ ఆమె మేడమీదికి వెళ్ళిపోయింది

గోపీ ఈ గొడవ పట్టించుకున్నట్టులేదు. వాడు పెదవులు బిగించి కలం గడ్డం కింద పెట్టుకుని దీర్ఘాలోచనా తత్పరుడై ఉన్నాడు. ఆ భంగిమ చూసి విశ్వం అడిగాడు

"ఏమిట్రా గోపీ ఆ ఆలోచన?"

గోపీ ఆ ప్రశ్నకి ఆలోచన నించి తేరుకుని విశ్వంవైపు చూసి అన్నాడు

"x విలువ తప్పిందన్నయ్యా."

"ఏది ఇలా తే"

గోపీ దగ్గిరకొచ్చి లెక్క చేసిన పుస్తకం విశ్వానికిచ్చాడు

"గోటితో పోయేదానికి గొడ్డలి దేనికిరా? ఈ లెక్క x పద్ధతిలో చెయ్యక్కర్లేదు. కొన్న ఖరీదు 100 అనుకో చిటికెలమీద వచ్చేస్తుంది ఆన్సర్."

గోపీ అనుమానంగా విశ్వంవైపు చూశాడు.

"మా మేష్టరుగారు x పద్ధతిలో చెయ్యమని చెప్పారే!"

"ఆయన కెవరోగాని ముక్కు చూపించమంటే తలవెనకనించి చెయ్యి పోనిచ్చి చూపించేట్టున్నాడే"

గోపీకి కొంచెం నవ్వొచ్చింది.

"రంగారావు మాస్టరుగారన్నయ్యా"

"ఏ రంగారావు?"

"నీ స్నేహితుడటగా"

విశ్వం కొంచెం ముఖం చిట్లించి "ఓహో, వాడా!" అన్నాడు

"రంగారావు మాష్టరుగారు నిన్ను చాలాసార్లు అడిగారు"

"నా క్లాసుమేటేలే."

"ఆయనకి లెక్కలు బాగా వొచ్చు. బలేబాగా చెప్తారుకూడా"

"సరేలే నేను చెప్పినట్లు ఈ లెక్క చెయ్యి." అయిష్టంగా పుస్తకంవైపు చూశాడు గోపీ

"ఏమిట్రా నీ సందేహం? నేను నీ మాష్టరు కంటే ఐదు క్లాసులు ఎక్కువ చదివాను, తెలుసా?" అన్నాడు విశ్వం.

గోపీకి ఆశ్చర్యం వేసింది. అన్నయ్య అబద్ధం చెబుతున్నాడని అతనికి తెలుసుగాని ఆ విషయం అతనికి నమ్మతగిందిగా కనిపించలేదు. ఆ పని ఇంతకుముందు చదువుల్లో లేదాలు తెలిసిన మాస్టరుగారు కూడా యావంగా బోర్డుమీద లెక్కలు చేసిస్తుంటే అదో విచిత్రమైన అభిమాన పూర్వకమైన గొప్ప అభిప్రాయం ఆయనమీద గోపీకి ఏర్పడ్డది

తను చెప్పిన పద్ధతిలో లెక్క ఎలా చేయాలో వివరించి ఆ ప్రకారం చేసి మాస్టరుగారికి చూపించమని చెప్పి మేడమీదికి వెళ్లాడు విశ్వం.

వాకిలి తెరకి కొత్తగా తెల్లటిగుడ్డమీద రంగు దారాల్తో కుడుతూ పందిరిమంచంమీద కూర్చుంది పద్మ.

"ఏమిటి పద్మా ఆ డిజైను?"

"పద్మ నవ్వి తిరగేసి, రేఖాచిత్రాన్ని చూపిస్తూ "మామిడిచెట్టుమీద కోయిల" అంది. ఆ బొమ్మ తీక్షణంగా చూసి అన్నాడు విశ్వం

"వేపచెట్టుమీది కాకి కాదూ?"

"కాదు సరిగా చూడు" అంది పద్మ అమాయకంగా

"మరి ఆ మాటలు కింద రాయలేదేం?"

"ఎందుకూ?"

"లేకపోతే ఎలా తెలుస్తుంది?"

విశ్వం కళ్ళలోకి చూసింది పద్మ. అతను నవ్వుకుంటున్నాడు. అప్పటికి తెలిసింది దానికి అతని మాటల్లోని వ్యంగ్యం

"పోదూ గొడవ" అంది విసుగ్గా

"ఎవరిదీ మహత్తర శిల్పం?"

"నేనే వేశా"

"నువ్వా?"

అటువంటి పొరపాటు పని పద్మ ఎప్పుడూ చెయ్యదని అతనికి బాగా నమ్మకం ఉంది. డిజైన్లకి కార్బన్ కాపీలు తియ్యటానికి సైతం ఆమె తనకి అతీతం ఆలోచించగా విశ్వానికి అకస్మాత్తుగా తట్టింది

"ఓ. డాక్టరుగారి చిత్రకళా నైపుణ్యం కాబోలు. అవునా?"

"కాదులే" అంది పద్మ

"నాకు తెలుసులే."

"తెలిస్తే సరే. పద్మ పనిచేసుకోనీ"

దృఢపడిపోయింది అతని అనుమానం. చూస్తూ చూస్తూ పద్మ క్రమంగా బూడిదలో పోసిన పన్నీరు కానివ్వటం అతని కిష్టంలేదు.

"కష్టపడ్లాయిన బొమ్మ నేను వేసిపెడతాలే. పాపం డాక్టరుగార్ని ఎందుకు అవస్థ పెట్టావు?" అని పద్మ సమాధానంకోసం కూడా ఎదురు చూడకుండా ఆమె చేతిలో ఫ్రేంలాక్కుని, గుడ్డ సరిచేసి తనకి చిరపరిచితమైన రేఖాచిత్రం 'మామిడిచెట్టుమీద కోయిల' త్వరత్వరగా గీశాడు

"ఎలా ఉంది?"

"ఎన్ని పాట్లు పడినా అదేగా?"

తెల్లబోయాడు విశ్వం "ఏతేమాత్రం?" అన్నాడు

"సరేలే, ఇలా ఇవ్వు" అంది పద్మ

"సరైన రంగుదారాలతో కుడితే భలేగా ఉంటుంది. డాక్టర్ వాడిలిపోవాలిసిందే" అని నవ్వి తిరిగి వెళ్ళిపోతూ గదిలోని నిలువుటద్దంలో చూసుకుని అదిరిపడి పద్మవైపు తిరిగి "ఇదేమిటి పద్మా, ఈ పందొమ్మిదో శతాబ్దపు అలంకారం?" అన్నాడు. అదేమిటోనని పద్మ వెనక్కి చూసింది. నిలువుటద్దం చూపించాడు విశ్వం. అది పూర్వం గోడకి చేరగిలబడి ఉండేది. ఇప్పుడు గోడనించి ముందుకు వంగి ఉండటం చూసి విశ్వం ఆశ్చర్యపోయాడు. వెంటనే దాన్ని మళ్లీ వెనకటి స్థితిలో ఉంచటానికి ప్రయత్నించబోయాడు

"హెయిర్ కటింగ్ సెలూన్లోలాగా గోడకి చేరవెయ్యటమేమిటి? అలా ముందుకి ఉంటేనే బాగుంటుంది" అంది పద్మ విసుగ్గా

అద్దం అలా వొదిలేసి ఆశ్చర్యంగా విశ్వం పద్మ ముఖంలోకి చూశాడు.

"హెయిర్ కటింగ్ సెలూనా? అక్కడ ఎలా ఉంటుందో నీకేం తెలుసు?"

పద్మ మాట్లాడలేదు. వెంటనే విశ్వానికి అర్థమైంది. ఇది డాక్టర్ గారి అభిరుచికాబోలు. అభిప్రాయాలు ఆడవాళ్లు ఎంత త్వరలో మార్చుకుంటారు.

మరేమీ మాట్లాడకుండా విశ్వం మెట్లుదిగి హాల్లోకి వచ్చాడు. గోడ అక్కడ వెలెడు పుస్తకాలు మాత్రం చాపమీదనే ఉన్నాయి. శర్మ ఎలా చేశాడో చూడాలని పుస్తకం తెరిచాడు విశ్వం. అతని ఆశ్చర్యానికి మేరలేదు. ఆ లెక్క x పద్ధతిలోనే మళ్ళీ చెయ్యబడి ఉంది. తను లేచి చూపించిన నమూనాకోసం పుస్తకంలో వెతికాడు విశ్వం. అదెక్కడా కనిపించ లేదు. విశ్వం కిటికీలోంచి బయటికి చూశాడు. ఓ మూల ఓ కాగితం ఉండ కనిపించింది. అది చూడగానే విశ్వానికి నవ్వొచ్చింది "ఓరి వెధవా!" అనుకున్నాడు. ఈ విషయం పద్మకికూడా చెప్పి ఆమెని పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వించాలనుకున్నాడు. సరాసరి మేడమీదికి వెళ్లాడు.

పద్మ అల్లికపని చేస్తూనే ఉంది. విశ్వం తొంగి చూశాడు. అది తను వేసి ఇచ్చిన బొమ్మకాదు. పద్మ అంతకుపూర్వం కుట్టటానికి ప్రారంభించిన చిత్రం. విశ్వం బుర్ర గోక్కున్నాడు. ఏం మనుషులు వీళ్లిందరూ! వివేకజ్ఞానం ఉపయోగించరేం! యుక్తి ఏమిటో తెలుసుకోటం కూడా ఇష్టం ఉన్నట్టు లేదు. మాటిమాటికీ ఆశ్చర్యపోవటం తనవంతవుతోంది. ఇంతకీ మనుషుల భావాలు చిత్రమైనవి.

విశ్వం పద్మతో మాట్లాడకుండానే వెనక్కి తిరిగి మెట్లుదిగి మళ్లీ హాల్లోకి వచ్చేశాడు. అక్కడ రంగనాథంగారు కూర్చొని వున్నారు. విశ్వాన్ని చూడగానే ఆయన అన్నారు.

"ఒరే విశ్వం, బావ రేపు వెళతానంటున్నాడు. సాయంత్రం బజారుకెళ్లి ఖరీదైన మంచి సూటింగ్ క్లాత్ సెలెక్ట్ చేసి తీసుకురావాలి. అతనికి మరీ మొహమాటం. పాపకి వెళ్లివచ్చింది చూడమంటే ఒప్పుకోడు. నువ్వే వెళ్ళి ఆ పనేదో చూడు కాస్త."

"అలాగే నాన్నా" అన్నాడు విశ్వం.

## 5

"కాలం సాగిపోతోంది. పనులు జరిగిపోతున్నాయి. పురాణాలు రాస్తున్నారు. రైతులు పొలం దున్నుతున్నారు. పంట పండిస్తున్నారు. శ్రామికులు శ్రమించి స్వేదజలం వర్షిస్తున్నారు. పెద్ద ఉద్యోగులు అలంకరిస్తున్నారు. ఫ్యాక్టరీల గొట్టాలు పొగ వదుస్తున్నాయి. మంత్రులు తిరుగుతున్నారు. నాయకులు అరుస్తున్నారు. విద్యార్థులు పుస్తకాలు తిరగేస్తున్నారు. పండిన ధాన్యం ఎక్కడో ఉడుకుతూనే ఉంది. ఇలా పనులు జరిగిపోతూనే ఉన్నాయి. కాలం గడుస్తూనే ఉంటుంది. కాలగమనం చూడగలిగినవాళ్లు చూస్తూనే ఉంటున్నారు. లేనివాళ్ళు నిర్లక్ష్యంగా కళ్ళు మూసుకుంటూనే ఉన్నారు. ప్రపంచంలో పుట్టి పెరిగిన ప్రతివాడూ ఏదో పనిచేస్తూనే ఉన్నాడు.

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః

అన్నాడు గీతాకారుడు.

కాని ప్రతిపని మనిషి అభ్యున్నతికి జరగటం లేదు. మనిషి ఇంకా గొప్పగా బతకటానికి ఉపకరించే పనుల్ని కాలం దొంగిలిస్తోంది. వాటికి బదులు మనిషిని కిందికి లాగే పనుల్ని కాలం ఇప్పుడు మనకిస్తోంది.

కాలం వెనక్కి తిరగదు. చేసిన పనుల్ని చెరపలేము. క్షణక్షణమూ జీవితం ఖర్చయిపోతోంది. తక్షణము జరగాలిసిన పని ఏమంటే, మానవజీవిత ప్రమాణాన్ని అన్నిరంగాలలో కొన్ని మెట్లు పైకిలాగే ప్రయత్నం. నేడు ప్రపంచం మొత్తంమీద జరగాలిసిన పని ఇది ఒక్కటే. ఇది ఎలా సాధ్యపడుతుందో చూద్దాం."

మైదానంలో ఒక సాంఘిక సేవాపరుడు ఉపన్యసిస్తున్నాడు. ఉపన్యాసాన్ని మొదటినుంచీ శ్రద్ధగా వింటున్నాడు విశ్వం. అప్రయత్నంగా అతనిలోని చిలిపితనం తలెత్తింది. ఉపన్యాసకుడు ఉపన్యాసాన్ని వెంటనే కొనసాగించకుండా కొంతసేపు ఆగి నాలుగుదిక్కులా చూస్తున్నాడు.

"కాలం సాగిపోతోంది" అన్నాడు విశ్వం గట్టిగా విద్యార్థిదళంలోని కోణంగితనంతో.

"ఇప్పుడు కాలాన్ని గురించి మాట్లాడిన దెవరో నాకు చూడాలని వుంది" అన్నాడు ఉపన్యాసకుడు.

విశ్వం ధైర్యంగా లేచి నిలబడ్డాడు. అలా అన్నందుకు అతను కొంచెం విచారించక పోలేదు. కాని ఒకపని చేసిన తరువాత దాని ఫలితం అనుభవించడానికి అతను వెనుదియ్యడు.

"దయచేసి మీరు ఒకసారిలా వస్తారా! మీతో రెండు విషయాలు మాట్లాడాలి."

విశ్వం అతనికి దగ్గరగా వెళ్ళాడు.

"మీ పేరు?"

"విశ్వేశ్వరరావు"

"కాలం సాగిపోతోంది అనే విషయం ఇంతకు ముందు మీకెప్పుడైనా స్ఫురించిందా?"

"స్ఫురించకుండా ఉండటానికి అదేం కొత్త సంగతి కాదు గదండీ?" కొంచెం నవ్వుతూ అన్నాడు విశ్వం

"అప్పుడు మీ భావాలు ఎలా వుండేవో చెప్ప గలరా?"

"నిన్న, ఇవాళ, రేపు—ఇదే కదా కాలం అంటే, అనిపించేది నాకు ఒక్కొక్కప్పుడు కాలం మీద ఏమైనా కవిత్వం రాద్దామని ఉండేది కాని సరైన భావాలు రాకపోవటంవల్ల రాయలేదు"

"మీ వయసెంత?"

"ఇరవై రెండు"

"ఈ ఇరవై రెండేళ్ల కాలంలో ఎన్నో పనులు చేసి ఉంటారు మీరు"

"అవును, మరి"

"ఇన్ని సంవత్సరాల్లో మీరు చేసిన అతి ముఖ్యమైన పని ఒకటి చెప్పగలరా?"

విశ్వం ఆలోచించాడు.

"ఏదైనా సరే, మీరు గుండెమీద చెయ్యి వేసుకుని ఫలానా శుభకార్యం చేశానని చెప్పగల ఒక్క పని, కనీసం ఒక్క మంచి పని చెప్పండి చాలు"

విశ్వం నుదుటిమీద స్వేదబిందువులు చేరాయి. ఒక్క మంచి పని తను ఒక్క మంచి పని కూడా ఇంతవరకూ చెయ్యలేదా? గొప్ప పనికాక పోవొచ్చు-కాని కనీసం ఒక్క మంచి పని.

విశ్వం తలవంచుకున్నాడు నిరుత్తరంగా

"పోనీ కనీసం అలాంటి పనిఏదైనా చెయ్యాలను కున్నారా?"

"ఎందుకనుకోలేదు" అన్నాడు విశ్వం తెప్పరిల్లి

"ఏమిటది?"

విశ్వానికి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఎంత ఆలోచించినా ఏమీ తట్టటం లేదు.

"ఒక్క ప్రశ్న అడుగుతాను. తడుముకోకుండా సమాధానం చెబుతారా?"

"అడగండి."

"మీ జీవిత లక్ష్యం ఏమిటి?"

ఏమిటి తన జీవిత లక్ష్యం? శూన్యంగా చూశాడు విశ్వం.

"మీరు ప్రత్యేకించి ఏమీ లక్ష్యం లేదన్న మాట?"

తను పూర్తిగా పరాభవం పొందాడు కాని పరాభవం కంటె కూడా తన నిష్ప్రయోజకత్వం అతన్ని బాధపెట్టింది ఇటువంటి ప్రశ్న లే తనలో ఎప్పుడూ ఉదయించలేదు.

ఎంత భావదారిద్ర్యం!

ఉపన్యాసకుడు విశ్వం భుజం తట్టి అన్నాడు "జరిగిన కాలంలో మీ రేమీ చెప్పతగిన పని చేసి ఉండక పోవొచ్చు పరవాలేదు రాబోయే రోజుల్లో మీరు తోటివాళ్లు నిర్విణ్ణులయే మహాకార్యాలు చెయ్య వచ్చు కావలసిందల్లా చెయ్యాలనే ఉత్సాహం, కోరిక ఉండటం. జీవితంలో ఒక లక్ష్యాన్ని ఏర్పరచు కోవటం గమ్యం చేరుకోటానికి నిజాయితీతో ప్రయత్నించటం. అంతే"

"కృతజ్ఞుడిని" అన్నాడు విశ్వం

"మీకేమైనా మాట్లాడాలిసిన విషయా లుంటే తరవాత మమ్మల్ని కలుసుకుంటాను ఇదిగో నా అడ్రసు" ఒక చిన్న కార్డు విశ్వానికిచ్చాడు ఉపన్యాసకుడు విశ్వం అది స్వీకరించి సెలవు తీసుకుని బరువుగా అడుగు వేసుకుంటూ పైదావందాటి బజార్లో ప్రవేశించాడు ఇప్పుడతని మనసులో విచారం లేదు తను త్వరలోనే మేల్కొన్నాడు అసలు తన జీవితం ప్రారంభమయే తరుణంకూడా అదే తన అస్తిత్వాన్ని తను సార్థకం చేసుకోగలడు.

బజార్లో నడుస్తున్నాడు విశ్వం బజారంతా అతనికి కొత్తకొత్తగా కనిపించసాగింది ఆకోజాన ప్రతి వ్యక్తి శ్రమపడుతున్నాడు ధనసంపాదనకి. శ్రమకు తగిన ప్రతిఫలం మాత్రం అందరికీ ముట్టదు చిన్న చిన్న దుకాణదారులు రోజంతా శ్రమపడి వస్తువుల అమ్మకంకోసం నానాబాధలూ పడుతూండటం తను చాలాసార్లు గమనించాడు. కత్తిలేని కోవాళ్ళు అతని కళ్ళలో ఎప్పుడూ మెదుల్తూనే ఉంటారు. ఏమిటి దీనికి నివారణ? ఆలోచిస్తున్నకొద్దీ అతను నిరుత్సాహ

పడ్డాడు. ప్రభుత్వాలన్నీ ఊకదంపుడు చేసేవరుసవర్గ అది. పాపం వృద్ధుడు తనేం చెయ్యగలడు!

"పాలిష్ చెయ్యమంటారా బాబూ బూట్లకి?" అడుగుతున్నాడు ఒక్కరాడు జాలిగా. తన కవసరం లేదు. కాని వాడికుంది జాలివేసి, చెయ్యమని రెండు కాళిచ్చాడు.

ఇలాగే ప్రతివాళ్ళూ తనని ఏదో అర్థిస్తే తను ఇవ్వదగినది కాదు దిగకుండా కే లోకు తెలిసే విషయం ఇది.

వాళ్లైతే తిండి ప్రచ్చొడు ఉంది ఆ మాటకొస్తే అందరికీ ఉంటుందేమో కాని మాస్తాలు కూన్యం

పంజచీకటు అలముకుంటున్నాయి తిరిగి తిరిగి విశ్వం తను ఎరిగిన బట్టల దుకాణంలోకి వెళ్లాడు

"ఏం కావాలండీ?"

విశ్వం సమాధానం చెప్పేలోపుగా వెనక నించి బతిమాలుతున్న స్వరం వినిపించి వెనక్కి తిరిగిచూశాడు మాసిపోయిన గడ్డంతో, చిరిగిపోయిన దుస్తులతో, రేగిపోయిన జుట్టుతో, గుంటలుపడిన కళ్లతో ఒకవ్యక్తి కనిపించాడు దీనాతిదీనంగా అతను ప్రార్థిస్తున్నాడు.

"మూడు రోజుల్నించీ తిండి లేదండి. దయచేసి ఏమైనా ఇప్పించండి"

అతను అనుకున్నట్టు అభిమానం అతని ముఖంలో ప్రస్ఫుటమౌతూనే ఉంది

విశ్వం అతనివైపు పరకాయించి చూశాడు ఆ వ్యక్తికి అంగలోప మేమీ లేదు దీపతనం మాత్రం మూర్తీభవించినట్లు ఉంది ఎంతమంది లేరు అలాంటి వాళ్లకి ఈ వ్యక్తి ప్రత్యేక మేమిటి? విశ్వానికి జాలికలగ లేదు.

"వెళ్లు" అన్నాడు.

అతను వెళ్లలేదు. మరింత ప్రాధేయపడ సాగాడు. అనుకోకపటం! పైగా బతిమాలుకోటటం! విశ్వానికి ఒళ్లు మండింది.

"మనిషివి మనిషివి అనుకోకపట మేమిటయ్యా? అభిమానం లేదూ? ఏదైనా పని చేసుకోకూడదూ ఇలా ముష్టెత్తడం తిరక్కపోతే?" కర్కశంగా అన్నాడు విశ్వం.

"పని దొరకలేదండి" హీనస్వరంతో అన్నాడా వ్యక్తి

"దొరక్కపోతే దొరికేదాకా వెతకాలి"

"దయచేసి తమరైనా ఇప్పించండి"

తను ఇప్పించాలిట, తనదగ్గిర ఉద్యోగాలు కుప్పపోసి ఉన్నట్టు!

"చాల్లేవెళ్లు" కసురుకున్నాడతను.

దుకాణదారు కూడా వెళ్లగొట్టాలని సిద్ధమయాడు ఆ వ్యక్తి నిర్లక్ష్యంగా వాళ్లవైపు చూసి వెళ్ళిపోతూ విషాదంగా అన్నాడు

"మీరు పని చూపించలేరని నాకు తెలుసు అనుకుంటూ ప్రతిపూటా బతుకు వెళ్లకపోతే చావరాదా అని మీ అభిప్రాయం. అదే మంచిది అవును కాని కాని ఎటొచ్చీ ప్రాణం ఎంత చులకన! ఎంత దరక"

దుకాణంలోని వాళ్లందరూ స్తబ్ధులయారు. ఇతడెవడో మామూలు బిచ్చగాడిలా లేడు స్పష్టంగా గాకూడా మాట్లాడుతున్నాడు

విశ్వం హృదయం ఆర్ద్రమైంది. తను మాటలు జారాడు విసుక్కున్నాడు ఏమీ చెయ్యలేకపోతే ఊరుకోవొచ్చు కాని అతని హృదయం గాయపరిచాడు, కొంపతీసి అతను సూచించినట్టు ఏ అఘాయిత్యమో చెయ్యడుగద! లేనిపోనిది తన మెడకి చుట్టుకుంటుందా పాపం కాని తనేం సహాయం చెయ్యగలడు ఒకపూట తిండికి ధర్మం చెయ్యగలడు. తరవాత

ఆ సమయంలోనే ఒక స్త్రీ దుకాణంలోకి వస్తోంది. ఆ అమ్మాయికూడా అతను అడుగుతాడని చూశాడు విశ్వం కాని అతనామెకేసి కూడా చూడకుండా ఆ వ్యక్తి వెళ్ళిపోతున్నాడు. ముచ్చెమటలు పోశాయి విశ్వానికి. అతనికోసం కంపించింది

"ఇదిగో ఏమయ్యోయ్" అని కేకపెట్టాడు. అప్రయత్నంగా అతను వెనుదిరిగి చూశాడు. విశ్వం మళ్లీ పిలిచాడు అతను తటపటాయిస్తున్నాడు

ఆ స్త్రీ దుకాణంలోకి వచ్చింది. విశ్వం ఆమెని గమనించలేదు అతని దృష్టి అంతా ఆ వ్యక్తిమీదఉంది.

విశ్వం మనసులో ఏదో మెరుపులా మెరిసింది. ఒక్క మంచిపని. .

తను ఇంతవరకు చెప్పదగిన మంచిపని ఒక్కటి కూడా చెయ్యలేదు

ప్రాణం నిల్పటం మంచిపని కాదూ!

విశ్వం ఇంకేమీ ఆలోచించలేదు. ఆ వ్యక్తిని మరోసారి పిలిచాడు. అతను ఏమనుకొన్నాడో గాని ముందుకువచ్చి విశ్వందగ్గిర నిలబడ్డాడు. విశ్వం ట్రౌజర్ జేబులోంచి వందరూపాయల నోటు తీసి అతని కందిస్తూ అన్నాడు

"ఇదిగో, తీసుకో, పని చూపించలేను, నిజమే కాని ఈ వంద రూపాయలతో ఏ కిళ్ళీ కొట్టైనా తెరిచి ఏదో విధంగా పొట్టగడుపుకో వొచ్చేమో ఏమంటావు?"

ఆ వ్యక్తి తెల్లబోయాడు. దుకాణంలోనివాళ్లందరూ ఆశ్చర్యంగా విశ్వంవైపు చూశారు. "వంద రూపాయలే!" అని గుసగుసలు విశ్వానికి వినిపించాయి. ఆ అమ్మాయి విశ్వంవైపు తలెత్తిచూసి, మళ్ళీ ఇంకోసారిచూసి అర్థంకానట్టుగా ముఖంపెట్టింది

విశ్వం గర్వంగా నవ్వుకున్నాడు. అమరావతి శివలింగంలా తను పెరిగిపోతున్నట్టనిపించిందతనికి. తన దగ్గిరున్నవాళ్లందరూ మరుగుజ్జుల్లా అవుతున్నారు

"తీసుకోవేం!" దర్పంగా అన్నాడు విశ్వం

ఆ వ్యక్తి ఒక్కక్షణం విశ్వం కళ్ళలోకిచూసి తర్వాత చుట్టూచూసి "వొద్దులెండి" అంటూ గబగబ బయటికి నడిచిపోయాడు.

కొద్దిక్షణాలవరకూ ముందుకు జాచిన చేతిలోని వందరూపాయల నోటు రెపరెపలు చూస్తూ అలాగే ఉండిపోయాడు విశ్వం అది స్వీకరించబడలేదు

"అదేమిటండీ అంత మొత్తమా?" అన్నాడు దుకాణదారు, విశ్వంవైపు వింతచూపులు చూస్తూ.

విశ్వం ప్రత్యుత్తరం ఇవ్వలేదు

"ఏం చూపించమంటారు?" వ్యాపారం విషయంలోకి దిగాడు దుకాణదారు

"గాబర్డీన్ సూటింగ్ చూపించండి"

విశ్వంవైపు ఆ అమ్మాయి మళ్ళీ చూసింది యథాలాపంగా అటువైపే చూసిన విశ్వం ఆమె ఉనికిని అప్పటికి గుర్తించాడు ఎక్కడో చూసిన రూపం అని అతనిమనసులో లీలగా అనిపించింది. ఆలోచించగా జ్ఞప్తికివచ్చింది. తను ఇంటర్మీడియేటు చదువుతున్నప్పుడు కాలేజీ వెళ్ళేసమయాల్లో స్కూల్కి వెళుతూ ఆ అమ్మాయి తనకి అప్పుడప్పుడు ఎదురయ్యేది! ఎవరో ఆమె! ఇప్పుడేం చేస్తోందో. పూర్వం తను చూసినప్పటికంటె ఇప్పుడు పొడుగెదిగింది కొంచెం బొద్దుగాకూడా ఉంది

బిల్లుచెల్లించి విశ్వం ప్యాకెట్ తీసుకుని బయటకి వచ్చాడు. అతని మనసులో మళ్ళీ తను ధర్మంచెయ్యబోయిన దృశ్యం మెదిలింది. అతను తనెందుకు తిరస్కరించాడు? భయపడిఉంటాడా? అంత మొత్తం అతను ఎప్పుడూ చూసిలేదేమో? పోలీసులు లాక్కుపోతారనుకున్నాడేమో? తను కావాలని అందరిఎదుటా ఇస్తున్నప్పుడు భయం దేనికి? తను ఇవ్వాలిసినవిధంగా ఇవ్వలేదేమో ఒకవేళ? అంతకంటె తనేంచెయ్యగలడు ఎవరూ చూడకుండా అతని చొక్కా జేబులో పెట్టాలా? బతిమాలి తీసుకోమని నచ్చచెప్పాలా? అవసరం ఉన్నవాడే తీసుకోకపోతే తనకేమిటి? ఏమైతేనేం, ఇప్పుడతను ఒకవేళ ఏ అఘాయిత్యం చేసినా తనకా బాధ్యత లేదు

విశ్వానికి ఎందుకో సంతృప్తిగా లేదు. తనేదో పొరపాటు చేశాడేమో! తనలో బహుశా ఏదో లోపం ఉండిఉంటుంది. అకస్మాత్తుగా అతనికి ఒక విషయం తట్టింది. ఆ వ్యక్తిని ఎలాగైనా ఆ దీనావస్థనుంచి తప్పించి సహాయం చెయ్యాలనే దృష్టి తనలో లేదు. ఒక మంచి పనికోసం-ఒక శుభకార్యం తనూ చేశాడనే మానసిక తృప్తికోసం తను ఆర్భాటంగా అందరి ఎదుటా తన ఔదార్యాన్ని ప్రదర్శించాడు! సిగ్గుచేటు!

విశ్వం ముఖం మలినమైంది. ఆ వ్యక్తి తనని చెప్పుతో కొట్టినా ఇంత బాధపడేవాడు కాదు తను

మరో ఊహకూడా వెంటనే తట్టిందతనికి. ఆ అమ్మాయి ఈ ఆర్భాటమంతా చూసి ఏమనుకుందో! తను బాగా డబ్బుగలవాడని అనుకుని ఉంటుంది. ఆ గాబర్డీన్ సూట్ తనకోసం కాదని ఆమెకి తెలియదు. పాపం ఆమె తనవైపు చూడటం తను కనిపెట్టక పోలేదు. తను ఘరానా అని ఆమెకి తెలుసో, తెలియదో!

ఉన్నట్టుండి విశ్వానికి ఓ అనుమానం కలిగింది తను ఈ హడావిడంతా ఆమె దృష్టిని ఆకర్షించటానికి చేశాడని దుకాణంలోని వాళ్లు అనుకున్నారేమో! కొంపతీసి ఆ అమ్మాయికూడా అలా అనుకోలేదుగద!

విశ్వానికి ముచ్చెమటలు పట్టాయి. తను ఘోర పాటు చేశాడు. ఒక వేళ ఆ వ్యక్తి ఆ సందర్భాపాయాన్ని బోటు తీసుకునిఉంటే ఉత్తచేతుల్లో ఇంటికి వెళ్ళవలసి వచ్చేది. ఇంట్లో అడిగితే ఏం సమాధానం చెప్పేవాడు? వానిమీద ఎంత గొడవ జరిగేది! తన పరిస్థితేమిటో వాళ్ళకేం అర్థమవుతుంది? ఇంకా నయం! ఆ వ్యక్తి తనకి మేలుచేశాడు కృ, తను నాటి తొందరమనిషి!

## 6

రంగనాథంగారు ఇరవైఏళ్ళు అఖండంగా హెడ్మాష్టరుగిరీ వెలిగించి రిటైరయ్యారు. ఆయనకి విశ్వం, పద్మ, గోపీ ముగ్గురే సంతానం. కిందటి మాఘ మాసంలోనే పద్మకి వివాహం జరిగింది. ఆమె భర్త శ్రీనివాసరావు ఎం. బి. బి. ఎస్ ప్యాసై డాక్టర్ సర్జన్‌గా ఉండి ఆమధ్యనే హైదరాబాద్‌లో ప్రాక్టీసు పెట్టాడు. ఆనర్స్ చదువుకున్నప్పుడు విశ్వానికి అతని పరిచయం లభించింది. ఆ పరిచయమే తరవాత బాంధవ్యంగా మారింది.

ఆరోజున శ్రీనివాసరావు ప్రయాణం నిశ్చితమైంది. అనుకోకుండా పద్మకూడా అతనివెంట రానుంది. ఈసారి పెళ్ళి అయిన తరవాత అత్తవారింటికి వెళ్ళటం ఆమె కిదే మొదటిసారి. ఎవరూ తోడు కూడా వెళ్ళటంలేదు. విశ్వాన్ని ఆహ్వానించాడు శ్రీనివాసరావు కాని "కాపురం పెట్టిం తరవాత చూడటానికి వస్తాలే" అన్నాడు విశ్వం.

బండి ఎక్కబోయేముందు తల్లిదండ్రులతో పాటు తనకి కూడా నమస్కారంచేసి పద్మ సెలవు తీసుకుంటూంటే విశ్వం హృదయం ద్రవీభూతమైంది. పద్మ తనకెప్పుడూ నమస్కారం చెయ్యలేదు. అదివర దాకా పద్మని కవ్వించి, నవ్వించి అల్లరిచెయ్యటం తనకి సరదాగా ఉండేది. అదికూడా ఉడుక్కోకుండా అంతకంటె ఎక్కువగా తనని కవ్వించేది. అకస్మాత్తుగా, తను ఇద్దరిమధ్యా ఇన్నేళ్ళనించీ ఆగి ఉన్న ప్రేమభావం పెల్లుబికింది. పద్మ ఈరోజున తనని గౌరవిస్తోంది. దాని జీవితంలో మరో అధ్యాయం ప్రారంభమైంది. కొన్ని క్షణాలు జీవితంమీద మహా ప్రభావం కలిగిఉంటాయి. ఈ దృశ్యం తన జీవితంలో ఎప్పుడూ మరువలేడు. నవ్వులాటకైనా పద్మని ఇక తను కవ్వించలేడు. వేళాకోళమైనా ఆమె చిన్నబుచ్చుకుంటే తన హృదయంలో మానని గాయం తగులుతుంది. కొన్ని మైళ్ళదూరంలో, మరో వాతావరణంలో వస్తు పరిస్థితుల్ని పరిశీలించుకుని జీవితం గడపాలి. తన అభిరుచుల్ని అవసరమైతే మార్చుకోటానికి సిద్ధపడాలి. ఆ క్షణంలో విశ్వం మనసులో వింతకోర్కె కలిగింది. పద్మకి జీవితకాలంలో ఎప్పుడైనా ఒక్క సహాయమైనా చెయ్యగలిగితే తన హృదయంలోని అవ్యక్తమైన ఏదో ఆరాటం, అస్పష్టమైనబాధ తగ్గి తనకి ప్రశాంతత కలుగుతుంది.

ఈ ఆలోచనరాగానే విశ్వానికి వెంటనే నవ్వు కూడా వచ్చింది. ఆమెకి సహాయం చెయ్యాలనే కోరిక బాగానే ఉంది. కాని ఆ అవసరం పద్మకి ఎందుకు కలగాలి!

దంపతుల్ని స్టేషన్ దాకా సాగనంపటానికి విశ్వం, గోపీ స్టేషన్‌కి వెళ్లారు. శ్రీనివాసరావు ఏదో హుషారుగా మాట్లాడుతున్నాడు కాని విశ్వం మనస్సు అంత బాగా లేదు.

గంట మోగింది. గార్డు ఈల వేశాడు. జండా ఊపుతోంది. ఇంజన్ కేక వేసింది. రైలు కదల బోతోంది.

పద్మ కేదైనా ఇవ్వాలనిపించింది విశ్వానికి. పత్రికల కుర్రడు ఇంతలో అటువైపు వచ్చాడు. ఏవో కొన్ని పత్రికలు కొని పద్మకిచ్చాడు.

"ఎందుకన్నయ్యా ఇవన్నీ?"

"కాలక్షేపం అవుతుందిలే, ఉంచనీ"

ఆ ఇవ్వటంవెనకాల హృదయం మూగభాష ఇద్దరికీ అర్థమౌతూనే ఉంది.

రైలు కదిలింది.

"వొస్తాబాబూ, గోపీ," అంది పద్మ గద్గదకంఠంగా.

వాడికి హృదయంలో కెలికినట్టయింది. బెంగ మాపులు మాగాడు. తనేదైనా తెలియక తప్పుచేస్తే, అమాయకంగా ఏదైనా అడిగితే "వెధవా, ఛర్ధారం కలిగిస్తున్నావు గాని" అని దబాయించి మందలించే వాళ్లు అక్కయ్యతప్ప ఇంకెవ్వరూ లేరని వాడికి తెలుసు. ఇంక అలా అనటానికి అక్కయ్య దగ్గర ఉండదు!

వాడి కళ్లలో నీళ్లు తిరిగాయి.

శ్రీనివాసరావు చెయ్యి ఊపాడు.

విశ్వం కూడా ఊపాడు

క్రమంగా రైలు దూరమైంది

గోపీ చెయ్యిపట్టుకుని విశ్వం స్టేషన్‌బయటికి వచ్చాడు. ఇలాంటి వీడ్కోలు దృశ్యాలని తను పూర్వం "సెంటిమెంటల్ ట్రాష్" అని కొట్టి పారేసేవాడు. ఈ రోజున అతని నేత్రాలు చెమ్మగిల్లాయి. అతనేమీ ఆలోచించటం లేదు. హృదయం బరువుగా ఉంది.

మార్గమధ్యంలో ఒక్కసారిమాత్రం విశ్వం, గోపీ మాట్లాడుకున్నారు

"అక్కయ్య మళ్ళీ ఎప్పుడు వస్తుందన్నయ్యా?" అన్నాడు గోపీ

"తొందరగానే వొస్తుంది." అన్నాడు విశ్వం ఆ సమాధానం వాడికి తృప్తిగాలేదు ఉండదని విశ్వానికి తెలుసు

"ఈ దేశంలో మగవాడు తన ఆధిక్యత రుజువు చేసుకోటానికి ప్రయత్నిస్తాడు. బహుశా ఎక్కడైనా అంతేనేమో. లేదా ఆ భేదం ఉంటే తరతమాల్లోనే! కాని, శ్రీనివాసరావు మంచివాడే" అని సమాధాన పడ్డాడు విశ్వం

ఇంటికివచ్చి భోజనాదులు ముగించుకుని తీరిగ్గా పడకకుర్చీలో పడుకుని పేపరు చూసి, చేసేపనిలేక నిద్రపోవాలని కళ్లు మూసుకున్నాడు విశ్వం. కాని నిద్రవచ్చే సూచన లేదు. సరదాగా మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యటానికి పక్క లేడు. గోపీ ఎప్పుడూ తోటిపిల్లలతో ఆడుకుంటూనో, చదువుకుంటూనో ఎక్కడో ఉంటాడు. ఇక తనకి కావలసినంత తీరిక. ఫలితాలు తెలిసి ఉద్యోగం ఏదైనా వచ్చేదాకా రోజంతా విశ్రాంతే. ఈ సమయం వృథా పోనీయకుండా ఏదైనా చెయ్యాలని అనుకున్నాడతను. వెంటనే "జీవిత లక్ష్యం" సంగతి జ్ఞాపకం వచ్చిందతనికి. తన జీవితలక్ష్యం ఏదైతే బావుంటుంది?

బొమ్మలు వెయ్యటంలో తనకి అభిలాష. కొస్తూ కూస్తూ ఉంది. స్కూల్లో డ్రాయింగు పరీక్షల్లో తనకి మంచిమార్కులే వచ్చేవి. పక్షులూ, జంతువులూ తనకి కరతలామలకం. మనుషుల బొమ్మలుకూడా కొంచెం శ్రద్ధ తీసుకుంటే బాగానే వెయ్యగలడు. చిత్రలేఖనం కృషిచేస్తే తను అందులో పేరు సంపాదించుకోగలడేమో! కాని దానికి ఎంతో శ్రమ, ఓపికా, కాలమూ కావాలి. తన కెటువంటి ఉద్యోగం వస్తుందో! నిత్యమూ కూడా బొమ్మలు వేసుకోటానికి తీరిక దొరకని ఉద్యోగమైతే అగాధంగా అవుతుంది. అయినా తను నిరుత్సాహపడకూడదు. ప్రారంభం చెయ్యాలి. తను గొప్ప చిత్రకారుడు కావాలి

ఈ ఊహ కలగానే దానిని ఆచరణలో పెట్టాలనే సంకల్పం దృఢమైందతనికి. తన అదృష్టంకొద్దీ ఆ ఊళ్ళోనే ప్రఖ్యాత చిత్రకారుడు ఒకాయన ఉన్నాడు

విశ్వం ఆలస్యం చెయ్యకుండా ఆ సాయంకాలమే ఆయన దగ్గరికి బయలుదేరి వెళ్ళాడు. ఆ చిత్రకారుడు అదృష్టవశాత్తూ తన స్టూడియోలోనే ఉన్నాడు. ఆ సమయంలో చిత్రలేఖనంలోని తన ఉబలాటమూ, కుతూహలమూ ఆయనకి తెలియచెప్పి సహాయం అర్థించాడు.

ఆ చిత్రకారుడు విశ్వాన్ని పరిశీలనగా చూసి ఒక తెల్లకాగితం, పెన్సిలూ ఇచ్చి అన్నాడు

"కోడిపుంజు బొమ్మ వెయ్యండి"

విశ్వం క్షణంలో గీశాడు.

"సున్నా చుట్టండి"

విశ్వం సున్నా అవలీలగా చుట్టాడు

"ఈ రెంటికీ తేడా ఉన్నట్టులేదా!" అన్నాడు చిత్రకారుడు నవ్వు పెదవులలోంచి చిందిస్తూ. విశ్వం చిన్నబుచ్చుకున్నాడు. అతి వేగా తనని పరీక్షిస్తాడని తను అనుకోలేదు

"ప్రాక్టీసు చెయ్యలేదు గదండీ" అన్నాడు

"నా సలహా విని మీరీ ప్రయత్నం విరమించుకోండి."

"ఎందుకండీ?"

"మీకు బొమ్మలు వెయ్యటం రాదు"

అలా ఆయన ముఖంమీద కొట్టినట్టు నిర్మొహమాటంగా అంటే విశ్వానికి ఆశ్చర్యంతో పాటు ఆగ్రహంకూడా కలిగింది

"నేను వేసే బొమ్మలు మా డ్రాయింగ్ మాస్టరుగారు మెచ్చుకున్నారండీ" అన్నాడు తమాయించుకుని.

"నేను డ్రాయింగ్ మాస్టర్ని కాదుగా"

"ప్రాక్టీసు చేసినా రాదంటారా?"

"ఉఁహుఁ మీకు ఫ్రీ హాండ్ లేదు."

విశ్వం ముఖంలో నిరాశ కనిపించింది. 'ఇక నిటలా నిరుత్సాహపరుస్తాడేం ఈయన' అనుకున్నాడు

"ఏదైనా బొమ్మ వేస్తాను, చూస్తారా?"

చిత్రకారుడు అయిష్టంగా ముఖం పెట్టాడు అది అంగీకారమే నని విశ్వం కోయిలబొమ్మ గీశాడు

"ఎలా ఉందండీ?" అని ఆశగా ఆయనవైపు చూశాడు, తప్పక మెచ్చుకుంటాడని భావిస్తూ.

అతను చిన్నగా, పొడిగా నవ్వాడు

"చిత్రలేఖనం బదులు మరేదైనా చేస్తే మీ కాలం వృధాకాదు" అన్నాడు.

"అంతేనా?"

"మీమీద నాకేమీ ద్వేషంలేదు ఫ్రీహాండ్ లేదని చెప్పాను, అంతే"

"మనిషి పుట్టగానే అక్షరాలు రాయటం రాదు కదండీ"

"అవును. ఇప్పుడా సంగతెందుకు?"

"నేర్చుకుంటే ఏదైనా వొస్తుందని చెబుతున్నాను కాపీలు రాసినవాడు గుండ్రటి అక్షరాలు రాస్తున్నాడు మీరైనా ఉన్నటుండి అమాంతంగా ఈ విద్య మీకు వొచ్చని తెలుసుకున్నారనుకోను"

"నన్ను మీ రపార్థం చేసుకుంటున్నారు"

"అయితే క్షమించండి. కాని నా మాటలు నిజమని మీకు రుజువు చెయ్యగలను సెలవు"

ఆయన ప్రత్యుత్తరానికి ఎదురు చూడకుండా విశ్వం చరచర వెళ్ళిపోయాడు ఆ నాటినించీ అహోరాత్రులు శ్రమపడి, పుస్తకాలు చదివి తెలుసుకుని, అభ్యాసంచేసి రేఖాచిత్రాలు సునాయాసంగా గియ్యటం నేర్చుకున్నాడు. స్వశక్తిమీద అతనికి నమ్మకం ఏర్పడింది.

ఓ రోజు సాయంత్రం మళ్ళీ ఆ చిత్రకారుడి దగ్గిరికి వెళ్లాడు

"మళ్ళీ వచ్చారా?" అన్నాడాయన విశ్వాన్ని గుర్తుపట్టి

"కివ్వరికంకోసం కాదులెండి, రుజువుకోసం" అంటూ కాగితం ఆయనముందు పెట్టి ఓ సున్నా గీశాడు.

"ఇదిగో మీ సున్నా ఇంకా కొన్ని కావాలా? ఒకటి, రెండు, మూడు—" చిన్నవి, పెద్దవి వరసగా కొన్ని సున్నాలు గీశాడు విశ్వం ఆయన ఆశ్చర్యంగా వాటివైపు చూశాడు

"అలా తెల్లబోకండి మరి నాకు ఫ్రీ హాండ్ లేదుగా" వ్యంగ్యంగా అంటూ వెళ్ళిపోబోయాడు విశ్వం. తటాలున చిత్రకారుడు అతని భుజంమీద చెయ్యివేసి ఆపాడు చిరునవ్వు నవ్వాడు.

"భేష్" అన్నాడు

విశ్వంకోపం ఇంకా పోలేదు

"సెలవిప్పించండి" అంటూ వెళ్ళబోయాడు

"నిన్ను ఆశీర్వదిస్తున్నాను" అన్నాడాయన విశ్వం వెళ్ళలేకపోయాడు ఓటమిని అంగీకరించి తనని ఆశీర్వదించిన అతని సహృదయత్వం విశ్వంకాళ్ళకి బంధాలు వేసింది

"తొందరపడి ఆవేశంగా మాటాడాను క్షమించండి"

"ఫరవాలేదు. నా దగ్గిర తెలుసుకోవాలసింది ఏదైనా ఉంటే నీ ఇష్టం వచ్చినప్పుడు నిరభ్యంతరంగా రావొచ్చు చాలా సంతోషిస్తాను" అన్నాడు చిత్రకారుడు అతని హృదయ వైశాల్యం విశ్వంలో భావోద్రేకం కలిగించింది

"మహాభాగ్యం" అన్నాడు.

"వెళ్ళిరా ఇంక" సెలవిచ్చాడు చిత్రకారుడు.

తేలికపడ్డహృదయంతో విశ్వం సెలవుతీసుకున్నాడు కాఠిన్యం వెనకాలనే ఎంత మృదుత్వం ఉంటుంది! అదే ఆ కళాకారుడి సందేశం అనిపించింది విశ్వానికి

## 7

నవ్యకళాసంఘం అనే సంస్థకి ఆ రోజున ప్రారంభోత్సవం జరుగుతోంది. దానికి కార్యదర్శి రంగారావనే యువకుడు. స్కూల్ టీచర్. అతను

విశ్వంతో ఎస్.ఎస్.ఎల్.సి. దాకా కలిసి చదివాడు. తరవాత విశ్వం కాలేజీ చదువుకీ, రంగారావు సెకండరీ ట్రెయినింగ్‌కీ వెళ్ళారు. అయినా ఇద్దరిదీ ఒకే ఊరు కావటంవల్ల తరచు కలుసుకుంటూ తమ స్నేహాన్ని వర్థిల్ల చేసుకుంటూ వచ్చారు. రంగారావు బాగా పాడగలడు. అతనికి నాటకాలంటే మొదటి నించీ సరదా. తోటివాళ్ళని కొందర్ని కూడగట్టుకుని నాటక సంఘం స్థాపించాడు. విశ్వానికి నాటకాలలో అంత అభిరుచి లేదు. అయినా రంగారావు ప్రోద్బల ప్రోత్సాహాల వల్ల సంఘంలో అతను కూడా సభ్యుడయ్యాడు. ప్రారంభోత్సవానికి వచ్చినవాళ్ళూ సంఘం లోని ఇతర సభ్యుల్నిగురించి విశ్వానికేమీ తెలియదు. ముఖ్యసభ్యుల్ని రంగారావు అంతకి కొంచెముందే పరిచయం చేశాడు.

పెద్దల ఉపన్యాసాల తరవాత ముఖ్యసభ్యులు కొందరు ప్రసంగాలు చేశారు. కళాకారులు జీవితానికి అ కోణాన తమని అంకితం చేసుకుంటున్నారనీ, కళని ఉద్ధరించటమే తమ జీవితాశయమనీ అందరూ ఉద్ఘాటించారు.

తరవాత వినోదవిజ్ఞానదాయకమైన కార్యక్రమం ప్రారంభమైంది. అంశాల్లో మొదటి అంశం రంగారావు గానం.

అతను శ్రావ్యంగా పద్యాలు పాడుతుంటే సభికులు తన్మయులై వింటున్నారు. తనకి పద్యం పాడటం రానందుకు విశ్వం ఆక్షణంలో మిక్కిలి విచారించాడు. మంచి పాట విన్నప్పుడు అనుకరించాలనే తన అభిలాష ఈ జీవితంలో తీరదు. తను ఆ విషయంలో చేసిన వివిధ ప్రయత్నాలు గుర్తొచ్చాయి విశ్వానికి. తన స్వరం తనకే అసహ్యంగా వినిపించేది. ఓసారి బీచివొడ్డున ఒంటరిగా ఉన్నప్పుడు భావావేశంతో తను గొంతెత్తి ఏదో పద్యం రాగయుక్తంగా అనబోయినప్పుడు తన స్వరం సముద్రపు ఘోషతో, పెద్దా ఇంజను కూతతో కలకలాగి చుట్టుపక్కలవాళ్ళకి భయకారణం కావటం తనెప్పుడూ మర్చిపోలేడు. రంగారావు ఒకసారి ఏ పాటనైనా విన్నాడంటే తప్పకుండా అదే వరసని సాహిత్యంతో సహా మళ్ళీ అనగలడు. రంగారావుమీద తనకి కొంచెం అసూయ కలిగినట్టు పసిగట్టి విశ్వం నవ్వుకున్నాడు. తను ఆనర్స్ పరీక్ష బాగా రాశాడని విన్నప్పుడూ, తన బొమ్మలు చూసినప్పుడూ రంగారావులో కలిగిన ఈర్ష్యాభావం తను గ్రహించగలిగాడు. అయితే ఇలాంటి భావాలకి విలువ ఇవ్వటం అనవసరం. ఈర్ష్య అనటం కంటె అసంతృప్తి అనటం సమంజసం. అవతలివాడికి ఉందని ఏడవటం ఈర్ష్య. తనకి లేదని విచారించటం అసంతృప్తి. చాలా మంది మనుషులు బహుశా ఈ రెండో తరగతికి చెందుతారు. ఈ భేదం గమనిస్తే మనుషుల్ని ఇంకా బాగా అర్థం చేసుకోటానికి వీలుంటుంది.

విశ్వం ఇలా ఆలోచిస్తుండగా రెండో అంశం ప్రారంభమైంది. వెంకటేశ్వరరావు అనే నటుడు నటనలోని వివిధ అంశాలను సోదాహరణంగా వివరించి చివరికి ఏకపాత్రాభినయం చేసి ప్రేక్షకుల మన్ననల్ని అందుకున్నాడు.

ఆ తరవాతది విశ్వం ప్రోగ్రాం. "మానవత్వం" అనే పేరుతో అతను ఒక చిన్న గేయం గానం చేశాడు. రాగం జోలికి పోకుండా ఆవేశంగా చదువుతూ తన్ను తానే మర్చిపోయి అక్కడక్కడ చిన్న వ్యాఖ్యానాలు కూడా చేశాడు. చివరికి—

అనిమిషత్వం నా ఆశ

మానవత్వం నా శ్వాస

అనే పంక్తులు ఉద్రేకంగా హెచ్చుస్థాయిలో అని ముగిస్తున్నాడు సభికులు చప్పట్లు కొట్టారు.

కార్యక్రమం అయిపోగానే చాలామంది విశ్వం గేయాన్ని ప్రత్యేకంగా మెచ్చుకుని అతన్ని అభినందించారు. విశ్వం వాళ్ళ మెచ్చుకోలుకి సంతోషాశ్చర్యాలు పొందాడు. తను అప్పుడప్పుడు గేయాలు రాసేవాడే కాని ఇంతవరకు ఒక్క గేయం కూడా ప్రచురించలేదు. ఏవో రాయాలని అనిపించినప్పుడు కూర్చుని నాలుగు పంక్తులు రాసేవాడు. అవి ఇతర్లు మెచ్చుకుంటారో లేదో అనే ఊహ అతనికెప్పుడూ రాలేదు. ఒక్కసారిగా అందరూ తనని ప్రశంసించటంవల్ల తబ్బిబ్బయిపోయాడు. కృతజ్ఞత చెప్పాలనే సంగతి కూడా అతనికి తట్టలేదు. రంగారావు తన గేయాలు కొన్ని వినటం, ఏదో ఒకటి ప్రారంభోత్సవ సమయంలో చదవమని బలవంతం చెయ్యటం అతను గుర్తుచేసుకొని రంగారావుకి కృతజ్ఞత చెప్పాడు.

ఆ సమయంలోనే ముఖ్యసభ్యులు కొందరు విశ్వం చుట్టూ చేరారు.

"రంగారావు గారూ, విశ్వంగారిచేత మంచి నాటకం ఒకటి రాయించాలి మీరు" అన్నాడు ఒక సభ్యుడు.

"అందులో మంచి గేయాలు తప్పకుండా ఉండాలి"

మరో సభ్యుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

"థాంక్స్— కాని నాకు నాటకాలు రాయటం రాదండీ" అన్నాడు విశ్వం

"మేం నమ్మంలెండి."

"సభ్యుడివి నువ్వే తప్పించుకోవాలంటే ఎలాగ?" అన్నాడు రంగారావు.

"తోవారికి దాటిన పనులు నెత్తిన వేసుకుంటే ఏమవుతుందో తెలుసా?"

"అదంతా నాకు వదిలెయ్యి"

"నాటక సంఘం నాలుగు కాలాలపాటు వర్ధిల్లాలని లేదా?"

"మంటిపాకులు చెప్పకు నువ్వు తలుచుకుంటే రాయగలవు అంతే." అన్నాడు రంగారావు. అందరూ ఆమాటే సమర్థించారు విశ్వానికి మాత్రం గుండెల్లో గాయపడింది. తనెప్పుడూ నాటకం కాదు గదా కథ కూడా రాయలేదు ఏదో పత్రికలకి వాళ్ళ మీదా, ప్రజల మీదా రుద్దితే ఫలితాలు సంగతి అలా ఉంచి తనకి అపచారం చేసుకున్నవాడవుతాడు ఏం చేయాలో అతనికేం తోచలేదు రంగారావుతో ఈ విషయం గురించి తరవాత రెండు మూడుసార్లు ముచ్చటించాడు అతను ఉన్న సంగతి వివరం చేశాడు

"ఒరే విశ్వం, నువ్వు నాటకాలు సరైనవి ఎక్కువ లేవు ఉన్నవి కూడా పాతవి" "ఉద్యోగ విజయాలు"లాంటివి మనం ప్రదర్శించటం లేదు గదా! నాటక సంఘం శ్రేయస్సు కోరి నువ్వు నీ చేతనైనంతలో ఏదైనా రాసివ్వు, బాగుంటే వేద్దాం"

ఇక విశ్వం ఏమీ అనలేకపోయాడు ఆలోచించి సాంఘిక నాటిక ఒకటి రాసిచ్చాడు అందరూ 'భేష్'గా ఉందన్నారు. రిహార్సల్స్‌కి వొచ్చిపోతూ ఉండమని విశ్వాన్ని అడిగాడు విశ్వం అలాగే నన్నాడు కాని వెళ్ళటానికి అతనికి మనసొప్పేది కాదు ఈ నాటకాల గొడవల్లో పడితే తన చిత్రకళాసాధన పూర్తిగా దెబ్బతింటుంది. చిత్రకళే తన లక్ష్యం.

ఒకరోజు రంగారావు మరీ బలవంతం చెయ్యటం వల్ల ఆ సాయంత్రం రిహార్సల్సుకి వెళ్లాడు

డాబ్లో ఓ పూలగది అద్దెకి తీసుకుని 'నాటక సంఘం' అని బోర్డు కట్టారు ఆ గదిలోని వాతావరణం చూసేసరికి విశ్వానికి చిరాకు వేసింది ఉన్న సామాను చిందర వందరగా వుంది కొందరు బీడీలు, మరికొందరు సిగరెట్లు తాగుతూ గది పొగతో నింపి కాల్చి వేసిన పీకలు గదిలోనే పారేస్తున్నారు సభ్యులలో కూడా ఒక క్రమశిక్షణ లేదు ఎవడి ఇష్టం వచ్చినట్లు వాడు ప్రవర్తిస్తున్నాడు తలా ఒకపక్కన మూగుతూనే ఉంది సభ్యులు మాట్లాడుతూనే ఉన్నారు

"హీరోయిన్ ఎవరు వేస్తున్నారు?" అన్నాడు విశ్వం

"వసంత అనే అమ్మాయి అందాల బరిణె. చూస్తే కుమ్మయిపోతావు 'ఒక్క నవ్వే పలు వజ్ర వైడూర్యాలు' అన్న కవి ఈమెను చూసే రాశాడా అనిపిస్తుంది. ఆ కళ్ళూ, ఉంగరాల జుట్టూ, వాలు జడా కపోలాలూ ఓహ్!"

అతని ధోరణి మధ్యలోనే ఆపి, "నువ్వు కూడా కవివా ఏమిట్రోయ్?" అన్నాడు విశ్వం

"ఆ పిల్లని ఒక్కసారి చూస్తే కవిత్వం పొంగులు కక్కుతూ పరుగులు తియ్యదూ?"

"అదేం అలంకారం, మహాశయా?" అన్నాడు ఒక నటుడు.

అందరూ గొల్లుమన్నారు.

"నీకు పెళ్ళయిందిగదురా?" అన్నాడు విశ్వం

"అయితే ఏముందీ, రసపాయి మన రంగారావు" అన్నాడు ఒక సభ్యుడు అందరూ మళ్ళీ గొల్లుమన్నారు

"జాగ్రత్త రంగారావు చెయ్యి పట్టుకు తేవు. కోర్టుకి లాగాదని"

"వ్యామోహమటా స్వామీ?" అన్నాడు రంగారావు.

విశ్వం ఈ సంభాషణకి విసుక్కున్నాడు. విషయం తప్పిస్తూ అన్నాడు

"ఆమె బాగా నటించగలదా?"

"పిచ్చివాడా? నీకు బొత్తిగా లోకజ్ఞానం లేదు. అందమైన ఆడది నటించడమెందుకోయ్ స్టేజిమీద నిలబడితే చాలదూ? నోళ్ళు తెరుచుకుని చూడరూ జనం?"

"జనం సంగతి కాదు ఆమె నటన సంగతి అడుగుతున్నాను"

"నాకు బాగానే ఉంటుంది ఆమె నటన"

"ఏమండీ డైరెక్టర్ గారూ?"

"గొప్పగా నటిస్తుందండీ. మొదటి నాటకంతోటే ఆమె సినీఫీల్డులో చేరిపోతుంది లెండి. అలాంటి వాళ్ళు నాటకాల్లో 'రాట్' అవుతారా?"

విశ్వం కొంచెం ఆశ్చర్యంగా అతని వైపు చూశాడు.

"నాటకాలు వెయ్యటం 'రాట్' కావటమని మీ అభిప్రాయం? ప్రారంభోత్సవసమయంలో నాటక కళనిగురించి గొప్పగా మాట్లాడారే!"

"నా అభిప్రాయంకాదు ఆమె దృక్పథం అలాగే ఉంటుంది."

"సినిమాల్లో చేరితే అంత బాజాప్తుగా ఉండదు లెండీ." అని విచారించాడు ఒక నటుడు

"ఎందుకండీ?" అన్నాడు చిరునవ్వుతో మరొకడు.

"తెలిసీయు దలిమాని నరుదల్ప బ్రహ్మదేవుని తరమే!"

"కవిచౌడప్ప శతకంలోని పద్యం కాదూ?"

"చంద్రరేఖావిలాపంలోదైతే మరీ రంజుగా ఉంటుంది"

"ఒరు శేయని రొమనరించిన నరనర" అని భావగర్భితంగా తలూపాడు మరొకడు.

వల్లివైపు జుగుప్సతో చూశాడు విశ్వం

"ఆమె ఇవాళ రిహార్సల్‌కి వొస్తుందా?"

"ఎందుకురాదు? పిల్పిస్తున్నాంసార్"

"ఎవరైనా త్వరగా రమ్మని హెచ్చరించినట్టే బావుంటుందనిమా త్వరగా రిహార్సలు మొదలుపెడితే పెందరాళే వెళ్ళిపోవొచ్చు" అన్నాడు విశ్వం.

"అందుకే కదండీ వెంకటేశ్వర్రావుగారు వెళ్ళారు వేరొకడు వెడితే ఆయన ఒప్పుకోరు"

"ఏం?" అన్నాడు విశ్వం అర్థంకాక

"అదంతే లెండి. ఏం రంగారావుగారూ?"

రంగారావు 'హుఁ' అని ముఖం చిట్లించుకున్నాడు

"వెంకటేశ్వర్రావుకి ఎన్నిసార్లో చెప్పాను — కొంచెం జాగ్రత్తగా ఉండమని ఎప్పుడో గాజుల చెయ్యి చెంపకుపరంబు కాకతప్పదుగదే"

అందరూ నవ్వారు.

"ఆమె కథేంటి?" అన్నాడు విశ్వం

అందరూ ఒక్కసారి ముఖముఖాలు చూసుకున్నారు వాళ్ళ ముఖాల్లో ఆశ్చర్యం తాండవించింది వాళ్ళలా ఎందుకు చూస్తున్నారో విశ్వానికి తెలియలేదు.

"ఏమిటో అనుకున్నాను నువ్వూ రసికుడివే" అని రంగారావు నవ్వాడు

"ఏమిటి నువ్వనేది?"

"ఓయి మహానుభావా, ఆమె కథేంతో ఇంత వరకూ తెలకనే చస్తున్నాం కొంచెం హైక్లాసల్లే ఉంది"

"అసలామె అటువంటిదికాదేమోనండీ చదువుకుంది కూడా."

"అవన్నీ తీసి అవతలపెట్టండి అది వంశపారంపర్యం బాబూ"

విశ్వానికి అర్థమైంది. 'ఛీ' అనుకున్నాడు తన ప్రశ్న ఎంత క్షుద్రంగా అర్థం చేసుకున్నారు. ఆ రెండో అర్థంలోనే వాళ్ళెందుకు తీసుకోవాలి వాళ్ళ మనస్సు లన్నీ కల్మషపూరితాలు ఇదా వీరి కళారాధన నాటక సంఘంట! వెంటనే రాజీనామా పారెయ్యాలనిపించింది విశ్వానికి కాని అంతిమందిలో ఆ పనిచేసి గొడవపడదలచుకోలేదు రంగారావులో కూడా ఇంత నీచత్వం ఉందనుకోలేదు కళాకారులైతే ఏం లాభం? ఒక వ్యక్తిని పరోక్షంలో చులకన చెయ్యటం ఘనకార్యమా? ఇంతమంది నాటక కళోద్ధారకులు ఇక్కడ కూడి చేసే పని అదేనా?

ఆమె ఎటువంటిదైనా కావొచ్చు కాని ఆర్టిస్టు. ఆ గౌరవం ఇవ్వలేనివాడు ఆర్టిస్టు అనిపించు

ఉంటాడా? అందరూ దగ్గుపుడున్నవాళ్లే, మాటల్లో మాత్రం పరిశ్రమ ఎక్కడా కనిపించదు. విశ్వానికి అక్కడ ఉండాలని బుద్ధిపుట్టలేదు.

"వసెళ్తాను రంగారావు. తరవాత ఎప్పుడైనా వొస్తాలే" అన్నాడు మర్యాదగా!

అదే సమయంలో నాయిక పాత్ర నిర్వహించే నటీమణి లోపలికి అడుగుపెట్టింది "ఆమె వొచ్చిందోయ్ కొంచెం ఉండు వెళ్దువుగానిలే" అని, ఆమె వైపు తిరిగి ఆహ్వానించాడు రంగారావు "రండి రండి"

అందరూ ఆప్యాయంగా పలకరించారు

"ఆలస్యమైం దేమండీ?"

"ఒంట్లో నలతగా ఉందా?"

"రాలేరా అనుకున్నాం"

కుశలప్రశ్నలు పూర్తయ్యాక. ఆమె కొంచెం ముభావంగా సమాధానాలు చెప్పింది రంగారావు విశ్వాన్ని ఆమెకి పరిచయం చేశాడు

"ఈ నాటిక రచించినవారు విశ్వేశ్వరరావు బి ఏ ఆనర్స్"

"నమస్తే ఇంకా ఆనర్స్ కాలేదండి"

అని చిరునవ్వులో ఆమె ముఖంలోకి చూసి అదిరి పడ్డాడు విశ్వం

వసంత అంటే ఆమేనా? ఆరోజున బట్టలకొట్లో తనకి కనిపించింది అనేకసార్లు స్కూల్ కి వస్తూ తనకి ఎదురైంది

"నమస్తే" అంటూ వసంత విశ్వం ముఖంలోకి చూసి ఏదో అనబోయి మళ్ళీ మాట్లాడకుండా ఊరుకుంది ఆమె ముఖంలో కూడా ఆశ్చర్యం ప్రతిఫలించటం విశ్వం కనిపెట్టాడు.

రిహార్సల్సు ప్రారంభమయ్యాయి ఆమె చక్కగా పాడుతుందని మెచ్చుకున్నాడు విశ్వం. ఆమె నటననీ, పాటనీ పదేపదే మిగతా వాళ్లందరూ పోటీలుపడి మెచ్చుకున్నారు. అయితే ఇదంతా కోలాహలం మామూలేగనుక వాళ్ల పొగడ్తలకి ఆమె ఏమీ ఉబ్బిపోలేదు విశ్వం అతిగా మాట్లాడక "బాగా పాడారండీ" అనీ "బాగా నటించారండీ" అన్నప్పుడు ఆమె నిజంగా సంతోషించింది.

ఆరోజుకి రిహార్సల్సు చాలించారు. బాగా చీకటి పడింది. వెంకటేశ్వరరావు తోడువస్తా నన్నాడు

"అక్కర్లేదు లెండి. మీరు మళ్లీ వెనక్కి ఇంత దూరం రావటం శ్రమ," అంది వసంత.

"నాకేం శ్రమలేదు"

"నేను బజారువైపు వెడుతున్నాను రిక్షా పంపిస్తాలెండి, పోనీ" అన్నాడు విశ్వం

"నేనూ బజారువైపే వెళ్ళాలి. దారిలో కనిపిస్తే రిక్షా చేసుకుంటాను పదండి, పోదాం" అంది వసంత

వెంకటేశ్వరరావు విశ్వంవైపు కొంచెం ఉగ్రంగా చూశాడు

విశ్వం ముందు నడుస్తున్నాడు వసంత కొంచెం వెనకగా, పక్కగా నడుస్తోంది. ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ఆవరించింది. ఏదో మాట్లాడాలనిపించింది విశ్వానికి కాని అతనికేం మాట్లాడాలో తోచలేదు ఆమే పలకరించింది.

"నాటిక రాసింది మీరనంటే ఆశ్చర్యపడ్డా నండీ" అంది

"ఏం నా ముఖంలో ఆ కళేమీ కనిపించటం లేదా?" అన్నాడు చిన్నగా నవ్వి

"అబ్బే అదికాదండీ మిమ్మల్ని ఎక్కడో ఇది వరకు చూశానండీ—ఊహున్నా"

"ఎక్కడ?"

"జ్ఞాపకం రావటంలేదు అంతకుముందు కూడా చాలాసార్లు చూశాను నేను స్కూల్ కి వెళుతున్నప్పుడు మీరు"

"కాలేజీకి వెళుతూ కనిపించేవాడిని కదూ?"

"అవును మీరు కూడా నన్ను చూశారన్నమాట."

"చూడకేం?"

"ఆ—! ఇప్పుడు జ్ఞాపకం వచ్చిందండి మీరు మీరు" ఆమె ఆగింది

"ఒక బట్టల కొట్టులో కనిపించాను కదూ?"

"అవును కాని అదేమిటండీ, ఎవరైనా అడిగినవాళ్ళకి అందరూ పావలాలు ఇస్తారా? భలే వాళ్ళే మీరు"

"ఏం, ఇవ్వకూడదా?"

"మీకు బాగా డబ్బున్నట్టుంది."

"లేకపోతే ఇవ్వకూడదా?"

"అని కాదు. ఎక్కడిదింక వస్తుంది?"

"నేను గొప్పవాడిని కాదు, నిజం చెప్పాలంటే"

"అదే నేనూ అనుకున్నాను."

"ఎలా అనుకున్నారు?"

"ధనవంతులైతే కారుండదూ? దుకాణం బయట కారేమీ లేదుగా!"

"మీరు మంచి పరిశీలకులే ఉండండీ"

"ఈమాత్రం దానికే! పొగడదలుచుకుని పొగుడు తున్నారు"

"మిమ్మల్ని ఊరికే పొగిడితే నాకేం లాభం?"

"నేను బాగా నటించానని మీరు మనస్ఫూర్తిగా అనుకుంటున్నారా?"

"లేక పోతే అలా అనటానికి నాకేం అవసరం?"

"మీరు మెచ్చుకుంటే చాలా సంతోషం కలిగిందండీ మీరు కోపగిస్తుంటారు గాని, మీ స్నేహితులు ముఖస్తుతికోసం అలా అంటారని వాళ్ల మాటల్ని బట్టి తెలుస్తుందండీ"

"వాళ్ళు నా స్నేహితులు కారు" అన్నాడు విశ్వం ముఖం చిట్లించుకుని, హేయభావంతో వసంత ఆశ్చర్యపోయింది

"అలాగా? అయితే పొరపాటపడ్డాను, క్షమించండీ"

"రంగారావు ఒక్కడే నాకు స్నేహితుడు రేపు మొహం వాచేట్టు వాడిని చివాట్లు పెడతాను" అన్నాడు విశ్వం కోపంగా

"ఎందుకు?" అంది వసంత ఆశ్చర్యంగా

విశ్వం తన పొరపాటు గుర్తించాడు. సప్పున అతనికి వసంత ఇంతకుముందు అన్న మాటలు గుర్తొచ్చాయి

"ముఖస్తుతి చేస్తున్నందుకు"

"ఓ అదా!" అంది వసంత

"మరేమి టనుకున్నారు?"

"ఏం లేదులెండి"

కొంచెంసేపు మౌనంగా నడిచారు ఇద్దరు. రిక్షా కనుచూపు మేరలో ఎక్కడా లేదు

"ఈ నాటకంలో వేస్తున్నందుకు మీ రెంత తీసుకుంటున్నారు?"

"ఏమీ!" అంది వసంత

"ఊఁ"

వసంత కొంచెం ఆశ్చర్యపడి అంది

"నేను నాటక సంఘంలో సభ్యురాల్ని కదండీ"

"అలాగా! అయితే సరదాగా వేస్తున్నారన్న మాట"

"అవును. ఆదీకాక ఇక నేను మొదటిసారి నటించబోవటం నాకు శక్తి ఎంతవరకు ఉందో తెలుసుకోవాలని ఒప్పుకున్నాను"

"పేరువస్తే ఏం చేస్తారు?"

"వీలైతే సినిమాలో చేరాలని ఉంది" అంది.

విశ్వం ఏమీ మాట్లాడలేదు. ఆ సమాధానం ఎందుకో అతనికి రుచించలేదు. వసంత మనసులో ఉన్నది మర్మంలేకుండా చెప్పే అమాయకురాలని గ్రహించాడు. నాటకసంఘంలోని వాళ్లందరూ ఆ కులంలో తోడేళ్ళలా అతని మనోవీధిలో కనిపించారు. అతని హృదయం ఆరాటపడ్డది

"నాటక సంఘంలో కొంచెం జాగ్రత్తగా ఉండండి"

"ఏం?" అంది వసంత ఆసక్తిగా అతనివైపు చూస్తూ.

"వాళ్ళలో కళారాధకులంటే పాడుబుద్ధులే ఎక్కువ" అన్నాడు విశ్వం. కాని వెనువెంటనే తొందరపడి అలా వాళ్ళమీద అభిప్రాయం వెలిబుచ్చినందుకు చింతించాడు. ఈ విషయాల్లో తనెందుకు అనవసరంగా కల్పించుకోటం? కొంపలేం దిగ [illegible]

వసంత ఏదో ఆలోచిస్తూ నడుస్తోంది. ఆమె తెలియనిక్కడ దేమీ కాదు. ప్రపంచం పోకడలు తెలియనిది కాదు. నాటకసంఘంవాళ్ళ బుద్ధులు పసి గట్ట లేకపోలేదు కూడా. కాని ప్రత్యేకించి విశ్వం అలా ఎందుకు హెచ్చరించాడో ఆమెకి అర్థం కాలేదు. కవి గారు అంటే అంటపట్టుగా మాటాడుతున్నారు. నాటక సంఘంలో మిగతా వాళ్ళకి మల్లే కాక కవిగారు మాటల్లో ఆమెకి హుందాతనం, ఆదరణా కనిపించాయి. సందర్భాలు ఊరికే వొదులుకోటం లోనే తనకి ఆనుభవమునకు మంచిదని తెలిసింది.

రిక్షా ఏదో ఎదురుగుండా వస్తోంది ఖాళీగా.

"ఇంక రిక్షా ఎక్కండి"

"ఇంకెంతో దూరం లేదండీ మా ఇల్లు. ఇప్పుడు రిక్షా గనక నడిచేశాను" అంది వసంత. సచ్చేశ్వరరావైతే తను గనకలో విడిచినట్టే "సరదాగా నడిచి వెళదామండీ" అనేవాడు. ఆ సచ్చేశ్వరరావుని చూస్తుంటే తనకి ఒక్కొక్కసారి అరికాలిమంట నెత్తి కెక్కుతుంది. కొంచెం జాగ్రత్తగా మసులుకోమని చెప్పాలి

"మీరు బి. ఏ ఆనర్స్ ప్యాసయ్యారా?" అందామె

"ఇంకా లేదు పరీక్షకి వెళ్లాను. ఫలితాలు రాలేదు"

"ప్యాసయినట్లైతే మీకు నేను టీపార్టీ ఇస్తాను. ఏమంటారు?"

"థాంక్స్ రెడీ" అన్నాడు విశ్వం నవ్వుతూ

మాటలసందడిలో ఎంతదూరం నడిచింది తెలియలేదు వాళ్లిద్దరికీ ఆశ్చర్యంగా వసంత ఆగి అంది

"ఇదేనండీ మా ఇల్లు ఇంక వస్తాను"

"మంచిది" అంటూ విశ్వం ముందుకి సాగి పోయాడు లోపలికి నడుస్తూ వసంత నాలిక కొరుక్కుంది తను ఇన్ని మాటలు మాట్లాడినా నాటిక గురించి ఒక్క ముక్కయినా అనలేదు తను వొట్టి మతిపిప్పిది ఏమనుకున్నారో కవిగారు!

(సశేషం.)

త్తులు నిర్వికల్పముగా నొక్కి వక్కాణించువారని చెప్పుట సాహసకార్యము. ఇతరుల మతములకంటె భిన్నముగా తనమతమును నిరూపించలేదో, అట్టి గ్రంథకర్త ఋషియే కాడు.

"నాసౌ ఋషి ర్యస్య మతం నభిన్నమ్"

అని మన పెద్దలే చెప్పిరి. ఈ పరిస్థితులందుకు మహర్షులు ఏ ఏ భిన్న సంప్రదాయములను నిర్వచించిరో ఏ ఏ ప్రత్యేక పద్ధతులను చూపిరో, మనకు తెలుసుకొను సాధనము కానరాకున్నది. మహర్షి ప్రణీతములగు సంహితలు ఏ యే కాలములో చూడ గలిగితిమి, ఇతరుల గ్రంథము లెంతవరకు రాజకీయ విప్లవాది కారణములచే నశించినవో, లేక రహస్యముగా దాగియున్నవో, తెలియుట లేక, తరువాతి కాలమున

"భూయోభిః పటుబుద్ధిభిః పటుధియాం
హోరాఫలజ్ఞప్తయే,
శబ్దన్యాయ సమన్వితేషు బహుశః
శాస్త్రేషు దృష్టేష్వపి,
హోరాతంత్ర మహార్ణవ ప్రతరణే
భగ్నోద్యమానా మహమ్
స్వల్పం వృత్తవిచిత్ర మర్థబహుళం
శాస్త్రప్లవం ప్రారభే"

(బృహజ్జాతకము)

అని, తన కాలమునకు పూర్వమునుండిన గ్రంథకర్తలచేత రచియించిన జ్యోతిష శాస్త్రగ్రంథములు పెక్కుండినట్లు ఆచార్య వరాహమిహిరుడు చెప్పియున్నాడు కదా! ఆ గ్రంథములలో పెంపున్నదే! అట్లే పూర్వులలో దక్షిణాయనము, ధనిష్ఠాదిలో ఉత్తరాయణము ప్రారంభమగుచుండినట్లు పూర్వులు రచించిన గ్రంథములలో నున్నదని తన బృహత్సంహితలో అతడు వర్ణించియున్నాడు. ఆ ప్రాచీన గ్రంథములన్నియు మనకిపుడు లభించియున్నవా? కొన్నియెడల వానిలో సద్గ్రహములు కాక మరి కొన్నింటిని ఎవరైన చెప్పియుండవలెనుగా?

'కాకా భుజండకుడాది' అంటుకు క్రమీళ జాతక గ్రంథములో 'బ్రహ్మ్యుదారి' మొదలగు కొన్ని గ్రహములు పేర్కొనబడినవని వింటిము. మన సద్గ్రహములు కాక మరికొన్ని అజ్ఞాత గ్రంథ రచనా కాలములో ప్రచారములో నుండియుండె ననుటకు సాక్ష్యముకాదా ఇది? ఇపుడు మనకు బ్రహ్మ్యసారి మున్నగువానిని గూర్చి యేమియు తెలియదు. అసాధారణ పద్ధతిలో అత్యాశ్చర్యకరముగా ఫలాదేశము చేయుచున్న నాడీ గ్రంథము లనేకములు నానాభాషలలో చూపట్టుచున్నవి. మనకిపుడు తెలిసి నాడులలోనున్న సూత్రముల ఆధారముతో అట్టి ఫలాదేశము చేయుట సాధ్యమగునా? ఎవరైనా చేయిచేసి, చెప్పగలిగిన సాహసవంతుడు చూపట్టడు. మరి, ఏ ఇతర సూత్రములు ఆ నాడీ గ్రంథ ఫలముల నిర్వచనమునకు ఆధారమైనవో మన మెఱుగము.

ఇట్టి పరిస్థితులలో, మన ప్రాచీన మహర్షులు చెప్పిన దంతయు మన కిపుడు లభించియున్న దనుట నమ్మరాదేమో.

పోతే, అందుబాటులో నున్న మూడు మూలము లయినా సమగ్రముగ అర్థమైనదని చెప్పగల మహానుభావు లెందరున్నారో, నాకు తెలియదు. బృహత్పరాశరహోరాశాస్త్రమందలి లగ్నశోధన పద్ధతిని కాని, లోకయాత్ర మున్నగు విషయము నుకాని, ఎవరు సాధించగలిగినారో, ఎంత ప్రయత్నించినా తెలుసుకొనలేకున్నాము. ఆవ్యక్త కాల నిషేక కాలముల పరస్పరసంబంధమును గూర్చి పరాశరుడు, బాదరాయణుడు మున్నగు ప్రాచీనుల మతములు భిన్నములని, కల్యాణవర్మ సూచించినాడు. ఇక్కడ విషయమున వరాహమిహిరాచార్యుడు, సమరసింహుడు, వేరు వేరు సంప్రదాయముల నాశ్రయించిరి. వారు వ్రాసిన సూత్రముల ప్రయోగము మనవాడుకలో నింకను లేదు. జైమినీ సూత్రముల అర్థమును గురించి పండితులలో ఐకమత్యము కుదురలేదు ఇక్కడిన్ని యైనా చెప్పవచ్చును.

సర్వసాధారణముగ, ఇప్పుడు వాడుకలో నున్నది పరాశర సంప్రదాయమని అందుముకదా! ఆ పరాశరుడు "తొల్లి చెప్పినది పెద్దలమాటయే కాని" తనకట్టి గ్రంథము లభించలేదని పదియవ శతాబ్ది ప్రముఖ శాస్త్రవేత్త పరిశోధకుడు, బహుగ్రంథకర్త యగు భట్టోత్పలాచార్యుడు చెప్పినాడట. అప్పటికే ఆ గ్రంథము నశించియుండె కాబోలు! ప్రస్తుతము ప్రకటితమయి యున్న 'బృహత్పరాశరహోరాశాస్త్రము' అను గ్రంథము ఒక పెద్ద కలగూరగంప యైనది కాని, సంప్రదాయము కాని, విషయ

విభాగము కాని, ఒక గ్రంథకర్త కైవాటములో తీర్చ బడినది తోచగు కాక, అందలి భాగములు కొన్ని అర్ధము స్థితిలోనే లేవు జన్మకాలము, ఆధాన కాలము, అను రెండింటికి కాక, చిత్రి వేళ కాలమునకు సహా జాతకము గుణించి సమన్వయము చేయుట సంప్రదాయమనియు, అది శిష్ట సాంప్రదాయమనియు, ఒకానొక ప్రాచీనగ్రంథ వ్యాఖ్యాత సూచించెను. ఇది ఏదో, వ్యాసఘట్టము!

ఇట్టి సందిగ్ధములలో ప్రాచీన మహర్షులు చెప్పినదంతయు తమకు తెలిసియున్నదనుకొను సర్వజ్ఞంమన్యులుండిరేని, ఎవరు వారికి సమాధానము చెప్పగలరు.

అది యట్లుండె

అన్ని శాస్త్రములవలె యీ జ్యోతిశ్శాస్త్రము సహా పరిశోధకులకు శాస్త్రజ్ఞుల అనథిక విశేషములవల్ల క్రమాభివృద్ధికి రాతిగించే యనుట యీ విమర్శకుల బుద్ధికి స్ఫురించదు. అపుడపుడు నూతన విషయములతో సంస్కరించినపుడే శాస్త్రము వన్నెకెక్కునని చెప్పిన దైవజ్ఞ వరాహమిహిరుని అర్ధవ దృష్టిని, భావార్ధమును గ్రహించినచో, ఇట్టి విమర్శకుల సంకుచితవృష్టికి అది అంజనము కాగలదు. మన ప్రాచీన సంప్రదాయములలో లేని అనేకాంశములను ఆ మహాశయుడు యవనమతమునుండి స్వీకరించి జంకు లేక బాహాటముగా తన గ్రంథములో చేర్చినాడు. అతడు వర్ణించిన ద్రేక్కాణ స్వరూపములు యవనులు చెప్పినవే. కొన్ని రాజయోగాదులలో యవనుల మతమునెత్తి అతడు దూషించినాడు. అంతయేల? గ్రహముల అన్యోన్య మిత్రత్వ శత్రుత్వములను గూర్చి ప్రాచీనమతమును చెప్పుటయే గాక, దానికంటే చాల భిన్నమైన యవనమతమును సహితము తన బృహత్ జాతకములో అతడు నిరూపించినాడు. ఈ విషయములో యవన సంప్రదాయమే వరాహమిహిరునికి అభిమతమని పదునారవ శతాబ్దమువాడగు కేశవార్కుడను హోరాతంత్రకర్త తన 'వివాహ బృందావన' గ్రంథములో —

“ఇద మదిర్య వరాహ మిహిరోదితో
విజయతేనకు దూషితవాన్ స్వయం,
స బహు మన్యత ఏవ యథాతథం,
జయతి శాస్త్ర మిదం యవ నేష్వపి”

అని సయుక్తికముగా సిద్ధాంతీకరించినాడు. కావున నే,

మ్లేచ్ఛాహి యవనా, స్తేషు
సమ్యక్ శాస్త్ర మిదం స్థితం,
ఋషివ త్తేపి పూజ్యంతే
కిం పునర్దైవ విద్ద్విజః”

అని వరాహమిహిరాచార్యులే యవనుల నెంతో గౌరవించినాడు. అతని యనంతరము సమరసింహాఖ్యుడను ప్రాచీనులు సాధించిన తాజక సంప్రదాయము సాకల్యముగ పారశీక భాష నభ్యసించి అందలి వాఙ్మయమునుండి సంపాదించినదే యని, మూడువందల సంవత్సరముల క్రిందనే, 'హాయనరత్న'కర్త బలభద్రుడు చాటి చెప్పినాడు. వాడుకలోనుండిన దశాపద్ధతులు చిరకాల సాధ్యములై తృప్తికరము ఫలములను చూపని కారణమున, యవన శాస్త్రమునుండి వర్షజాతక పద్ధతి మున్నగు ప్రయోగములను సమరసింహాదులు గ్రహించి విపులీకరించిరట.

“ప్రాయో న జాతక ఫలే
చిరప్రమోశ్యే మతిః స్ఫురతి పుంసాం,
తేనాత్ర హాయన ఫలం
ప్రకాశ్యతే తాజక ప్రోక్తం”

అని సమరసింహుడే చెప్పినాడట

లగ్నము, సప్తగ్రహములు అను ఎనిమిదింటికి గోచారమువలన, కలుగు శుభాశుభ ఫలములను సూచించు పద్ధతిని అష్టకవర్గమందురు కదా? ఈ పద్ధతిలో రాహు కేతువులకు స్థానము లేదు. కాని వరాహమిహిరాదులు చెప్పకపోయినా, రాహుకేతువులకు భావఫలములను తరువాతివారు విపులముగ వ్రాసిరి. అట్లే వానిస్థానములకు సయితము గోచారఫలము, కలదందురా? వానికి ఫలములను సాధించు 'ఏకవర్గ' మను పేరుతో సుమారు నూరు సంవత్సరముల వెనుకనుండిన యొకానొక శాస్త్రజ్ఞుడు ప్రత్యేకగ్రంథమును రచించెననియు అది అముద్రితముగా మూలపడియున్నదనియు, కొన్ని సంవత్సరముల క్రింద ఒకానొక ప్రాచీనజ్యోతిశ్శాస్త్ర పండితుడు నాతో చెప్పెను.

పరిశోధకుల అనుభవముల మూలముగ, క్రమముగా శాస్త్రసంప్రదాయములు అభివృద్ధి నొందు చున్నవనుటకు ఇంకెన్నియో కారణములు చూపవచ్చును. ఇటుండగా, తృప్తికరముగు నూతన సామగ్రి పరిశోధకుల పుణ్యమున మనకు లభించినపుడు దానిని నిరాకరించుట ఏమి వివేకము?

పోనిండు ప్రాచీన పద్ధతిలో ఏమార్పులు చేసినా, మహర్షులపట్ల అపచారమో అపరాధమో, చేసినట్లు మన ప్రాచీన శాస్త్రజ్ఞులు భావించెడివారా? తైత్తిరీయ బ్రాహ్మణకాలమున జ్యోతిశ్చక్రమున ఇరువది ఎనిమిది నక్షత్రములు. తరువాత ఎప్పుడో ఏమి కారణమో ఇరువదియేడు నక్షత్రముల పద్ధతి వచ్చినది.

“నక్షత్రాణాం అహమభిజిత్” అని భగవత్స్వరూపముగా భగవద్గీతలో పొగడ్తనొందిన 'అభిజిత్'

నక్షత్రమును, ప్రతిష్ఠితమైన దానిని నిరాదరించుట పాపముకాదా? దానవగురువైనను గౌరవించిన వరాహమిహిరుడు, అయవనుల నుండి ఆ శేకాంశములను స్వీకరించిన సమరసింహుడు సహోదరభావములపట్ల మహోపకారమునకు ఒడిగట్టినవాని అనవద్యుడు గ్రహముల దృష్టి విషయమున భిన్నమార్గము నవలంబించిన జైమిని పరాశరునికి అపచారము చేసినవారగుదురు. ఆ శేక విషయములకు దశాంశపద్ధతులను వివేచించి ఏపద్ధతి ఎట్టి జాతకముల కుపయోగించ వలయుననుటం గూర్చి చెప్పక సూత్రములు పరాశరుడు చెప్పియున్నాడని ఎఱుగుదుము. అసూత్రములకు జలాంజలి ముట్ట చెప్పి, ఏ జాతకమయినాసరే — రాజులదయినా, పశువులదయినా, కడకు సంస్థలదయినా — వింశోత్తరీ ప్రయోగముగా వింశోత్తరీపద్ధతి కట్టుట అనేక స్థలములలో ఆచారముగనున్నది. పరాశరునిపట్ల చూపు గౌరవమేమైనది?

"భాస్కర విషువేఖాయా
ఉదక్ స్థితో త్తరాయణం,
దక్షిణస్థే తతః సూర్యే
విద్యాత్ దక్షిణాయనం"

అని భరద్వాజ మహర్షి వాక్యము భూమధ్యరేఖకు ఉత్తరముగనున్నపుడు ఉత్తరాయణము, దక్షిణముగనున్నచో దక్షిణాయనము, అనుట. మకరాదిగ ఉత్తరాయణమని కర్కాటకాదిగా దక్షిణాయనమని, మన మిప్పుడు వాడుచుంటిమి. ఈ మార్పు ఏల వచ్చెనో, దానికి ఉపపత్తి ఏమో తెలియ లేదని శ్రీ పత్యాచార్యులే సూచించియున్నారు

"దినప్రవృత్తిర్మకరాత్ మహాదౌ,
తులాధరాద్యాచ నిశాప్రవృత్తిః,
తే కల్పితే హ్యుత్తరగా కర్కటాద్యా
వ్యత్రోప పత్తిం నవదే బ్రువంతి"

అని ఈ యపచారము ఎవరు చేసిరో?

"చల సంపాత్రి తిగ్మాంశోః
సంక్రమాయ స్వసంక్రమః,
అజాగళ స్తన ఇవ
రాశి సంక్రాంతి కల్పనే"

అని నిరయన పద్ధతిని హేళనముచేసి, సాయన పద్ధతియే ఉత్తమమని శిష్యమహర్షి చెప్పినట్టి నిరయన పద్ధతి నవలంబించుచున్నారంటే ఆ మహర్షి యభిప్రాయము త్రోసి రాజా చేయుటచే అతనిని అవమానించు చున్నట్లు భావింపవలసి వచ్చునుగదా?

పోనిమ్ము ఉదాహరణ మొక్కటి చూపుట ఇట్టి దృష్టాంతమే హెచ్చు ప్రయోజనకారి.

ఉన్నత విద్యను ఆర్జించి, అందచందములు కలిగి, అవివాహితగా నున్న ఒకానొక తరుణి నిరయన జాతక చక్రము, నవాంశ చక్రమునూ, ఈ క్రింది విధముగా నున్నది —

| | | | |
|---|---|---|---|
| | | గు 5-89 | ర 5-52<br>బు 14-21<br>శు 19-34<br>X 27-24 |
| రా 28-18 | (నిరయన)<br>జాతక చక్రము | | కు 16-47 |
| శ 10-49<br>చ 0-8 | | | కే 28-18 |
| | | | I 28-43 |

| | | | |
|---|---|---|---|
| శు<br>కు | శ | | రా |
| గు<br>బు | (నిరయన)<br>నవాంశ | | |
| చ | | | |
| కే | ర | | ల |

జన్మకాల రవి మహాదశా శేషము 4 సం 4 నె 17 ది

రాహు మహాదశలో బృహస్పతి అంతరములో ఎవడో తగిన వరుడొకడు వచ్చి చూచి సమ్మతించి, వివాహము చేసికొందునని మాట ఇచ్చినాడు. ఈమె జాతకములో అష్టమ కుజదోషమున్నది. ఆ వరుని జాతకంలో కుజదోషము దోషసామ్యమున్నదని, వివాహము జరుగవచ్చునని, పెద్దలు నిర్ధారించినారు. తరువాత, ఇరుపక్షముల వారికిని, ముందు జరుగవలసిన కార్య క్రమమును గురించి జాబు జవాబులు క్రమముగా జరుగ

పొసగినది. ముహూర్త కాలనిర్ణయము దండగ్ఘమున అనుకూల్య ప్రాతికూల్యముల సంప్రతింపులు ప్రశ్నలో నుండెను. నిర్ణయము జరిగి రమారమి అరమాసములు గడచినవి. కొన్నాళ్ళలో నే తూడుముక్కు పడి శుభకార్యము జరుగగలదని యూపట్టినది. కాని, అంతలో ఏ పిల్లకుమ్మక్కో, తెలియని తిలంపుగా, తిరకీ సంబంధము అక్కరలేదని అవకాడు జాబు వ్రాసెను. క్రమ టలో జాతకమునకు ధరతి వాక్యము పాడి యీ నిరాకరించినాడు సంబంధము అక్కరలేదని చెప్పుటకు కారణములు కనవా? "స్పష్టతాదశాత్ దంతిధింగః" అనునట్లే కారణ మేదో సూచించి చేయి కడుగు కొన్నాడా వరుడు. ఆ తిగణి మనసునకు ఇది గొప్ప దెబ్బ. ఇక, "పునః కౌచన ప్రాదన" వరాన్వేషణ కార్యమునకు మూల ప్రాపుకో తలపెనకే పాపము!

ఈ జాతకమునకు ఇటి ఫలము తాను చెప్పియుండును అని మన ఎమ్యన్ కనకోకయుడు తెలిపిన కారణము లివి—(1) ఉభయ కేంద్రాధిపత్యముగల ధర్మపావాధిపతి యగు గురువు, ఉచ్చుడైనా, లాభస్థానములో నుండినా 'పాపి' అయినాడట. అతని దృష్టి సప్తమ భావమునకు చెరుపట!

ఉచ్చగ్రహము కారకాంతరములచే మేలు చేయలేక పోవచ్చును కాని, చెరుపు చేయునని వరాహమిహిరాదులు చెప్పిరి. అంతులో, లాభ భావమున నున్న శుభగ్రహము అశుభఫలము నిచ్చునటో, ఇక వెవ్వరి? కేంద్రాధిపత్యములు గల గురువు పాపి యగుపట, ధను, మీన, కన్యా, మిథునములలో పుట్టినవారి కందరికిని గురువు పాపి కావలసి వచ్చును. మూరక విషయములో కేంద్రాధిపత్యము గురువునకు దోషముగా పరిణమించు నేమో కాని, ఇతర సందర్భములలో అతడు 'పాపి' అయినాడనుట కేవలము శాస్త్రమునకే కళంకము.

"కేంద్రాధిపత్య దోషస్తు
బలవాన్ గురుశుక్రయోః"

అను 'జాతక చంద్రికా' వాక్యమును బట్టి చేసిన విచిత్ర సిద్ధాంత మిది. కేంద్రాధిపత్యము 'దోష'మనుటే ఆ గ్రంథకర్త అభిప్రాయము కాని, ఆ ఆధిపత్యముచే గురువు 'పాపి' అగునని కాదు. ఒక చిన్న ఉదాహరణము చూడుడు. ధర్మరాజు మహా సత్యవ్రతుడు, సత్యసంధుడు. ఎప్పుడో వ్యాజము పెట్టి ఒక అసత్యమాడెను. అది అతనిపట్ల దోషమే. కాని దానిచే అతనిని పాపి అనరాదు. ఈ రెండిటికిని గొప్ప భేదము కలదని సహృదయులు గ్రహింతురు గాక.

(II) పైవిధముగ పాపియైన గురువు సప్తమ భావమును వింశుద్భృష్టితో చూచుటచే ఆ భావము పాప సంకలమైనదట!

నా దృష్టిలో, ఇదియొక విచిత్ర సిద్ధాంతము. భావాధిపతి భావమును చూచినచో ఆ భావము చెడునని ఏ మహర్షి చెప్పినాడో తెలియదు.

"యో యో భావః స్వామి సౌమ్యాభ్యాం
యుక్తో దృష్టోయ మేధతే"

అను మొదలగు ప్రమాణములచే అట్టి దృష్టి భావ పోషక మగుననుట శాస్త్ర సంప్రదాయము. వరాహమిహిరాచార్యుని యుపలక్షణ మాత్రమిది

"హోరా స్వామి గురుజ్ఞవీక్షిత యుతా,
నాన్యైర్వా, వీర్యోత్కటా"

(III) అంతే దృక్కములో సప్తమభావము శని కుజుల వలన పాపకర్తరి పాలయినదట! ఆ చక్రములో అష్టమాధిపతి శని దృష్టి లగ్నముపై నున్నదట! శుక్రుడు ఉచ్చాంశలో నుండినా లగ్నాధిపతితో చేరినా, కళత్రకారకుడై సప్తమములో నుండుటచే 'కారకో భావనాశాయ' అను వాక్యమువలన ధర్మ పావము పాడైనదట!

ఏమి పాండిత్యము? పాపుల సాంగత్య మింకే దృష్టి, సంయోగము, పాపకర్తరి, మున్నగు యోగములు నవాంశ చక్రమున కన్వయించు సంప్రదాయము ఏ మహర్షి ప్రోక్తమో తెలిపి యుండిరా? ఏ విద్వాంసుల కంఠ యంగీకరించి యుండెడిది? దృష్టిని సాధించి దానికి విలువ నిర్ణయించు సూత్రములను విధించిన శ్రీపతి ప్రముఖుల గతి యేమి? పోనిండు. సప్తమ శుక్రునికి 'దారనాశ' ఫలమే చెప్పినది కదా! శుక్రుడు కళత్రకారకుడని, పాపము, కళ్యాణవర్మకు తెలియదు కాబోలు.

(IV) నవాంశలో సప్తమాధిపతి గురువు సప్తమములో స్వక్షేత్రబలము కలిగి యుండినా, శత్రుగ్రహమగు శుక్రునితో చేరుటచే అశుభుడైనాడట!

పాశ్చాత్యాచార్య మతమున గురుశుక్రులు పరస్పర మిత్రులే కాని శత్రువులు కారు. మరి యవనాచార్య మతమందో, నా గా అన్యోన్య మిత్రులే. విద్వాంసులు సూచించినది ఏ మహర్షి సిద్ధాంతమో! శుక్ర క్షేత్రములో గురువునకు, గురు క్షేత్రములో శుక్రునికి, శాస్త్ర గ్రంథములలో శుభ ఫలము చెప్పబడినది కాని, అశుభ ఫలము లేదు. వారొకరికొకరు శత్రువులైనచో, ఇట్టి ఫలము కలుగుననుట యుక్తి సహము కాదు. కావున నే,

"శ్యాలి శ్యాస్త్రేషు సర్వేషు
జని తర శ్చే గుణః శుభః,
జీవస్య జనితా శత్రూ
యది, తద్యుజ్యతే కథం"

అని 'జాతక తిలక' గ్రంథకర్త గురు శుక్రుల శత్రుత్వపు సిద్ధాంతమును అధిక్షేపించినాడు.

(౪) కుజుడు ఎనిమిదింట ఉండుటచే కుజ దోషమున్నది. ఇది వివాహ విషయమున మహాదోషము

ఇచట వృశ్చికములో నున్నాడు కుజుడు.

"స్వసిత రాశి స్థితే భౌమే,
కుజదోషో నవిద్యతే"

అను అపవాద సూత్ర ముండుటచే, ఈ కుజ దోషమునకు గొప్ప విలువ లేదనవచ్చును అది యట్లుండ, ఉదకుపాలు (శానకోరు కుజుడు అష్టమ మందున్నచో, వివాహమై క్లేశము కలుగవచ్చునుకాని, వివాహ భంగమగుటకు హేతువు చూపట్టదు

జాతక మహాశయులకు ఒక్క గుణవి తెలిగిన ఫలమునకు పై కారణములు ఏ విధముగా తగిన వనవచ్చునో యూచింపుడు ఇటి కార్య కారణము సమన్వయమునకు ఎంత విలువ కట్టవచ్చునో, తద్జ్ఞులే ప్రమాణము

ఈ క్రిందనున్న సాయన జాతక చక్రమును ఒక్కసారి కటాక్షించుదురుగాక. నూతన గ్రహములు సయితము దానిలో చూపబడి యున్నవి

| | | | |
|---|---|---|---|
| రా 21-12 ధర్మ 12-55 | శ 22-48 | పుణ్య 15-57 కు 28-33 | ర 28-46-2 |
| శ 3-43 (వ) | (సాయనము) శుద్ధ జాతక చక్రము | | బు 7-15 శు12-18 (వ X 20-1 య 21-4 |
| చ 23-6 | | | దాంపత్య 0-56 గు 19 41 |
| | | I 21-37 | ఇ 5-32 కే 21-12 |

లగ్నము కోమలవ్రభావముగల తుల. యముడితో చేరి లగ్నాధిపతి శుక్రుడు గగనమధ్యమున ప్రకాశించుచున్నాడు భాగ్యములో రవి రాజయోగకారకుడు (దశమ పంచమాధిపతి) శని ప్రబలుడై నాల్గింట నుండుట లాభస్థానములో తృతీయ (విద్యా) షష్ఠాధిపతి బృహస్పతికలకు గొప్పవిద్య, యోగ్యమగు వృత్తి, అధిక స్వాతంత్ర్యము, వినయవిధేయతలు, నైతిక ప్రవర్తనము, సాధుశీలము తెలుపు జాతక మిది తగిన చేతన ముతో యోగ్యమైన యుద్యోగము కలదు.

ఇగట ముఖ్యమగునది సప్తభావముగదా? సప్తమాధిపతి కుజుడు ఎనిమిదిభాగల దూరములో అష్టమ భావమందేయున్నాడు అకాలాగ్యము, అందోళనము సుఖాభావము దీనిఫలము కావచ్చును. భావమధ్యమునకు కుజుడు దూరముగుండుటచే, ఈ ఫలములో రమారమి నూటికి యాభయింబులకంటె హెచ్చుగా రాదు ఉండుగాక

సప్తమభావ మధ్యబిందువునకు సార్థకేంద్రములో మహారాగరావి ఇంద్రుడున్నాడుకదా? వివాహ విషయమున జాతకుల లావాస్తవమును కమనీయబాలక క్రీడాపాలకుటో, ఇతరులచే వంచింపబడుటో, జరుగవచ్చును ఇకపోతే, ధర్మభావమధ్యమందే నికరముగా వరుణుడు పీఠం పెట్టుకుని కూర్చుండియుండుట వరుణ రాలు గమనించగలరు. ఆకర్షణము, అపకర్షణము, అను ధర్మములతో పరిపాలించు చేర్పరి వరుణుడు కనుక సవిప్రలంభ శృంగార ప్రియుడని, విడాకుల గ్రహమని, ఇతనికి ప్రతీతి స్వాతంత్ర్య కాంక్ష మిక్కుటముయి పరిస్థితుల మార్పునకు తగిన రీతిగా అనుకూలించి, పొంది, సాగి, మనుష్యభావము ఇతడు చేర్పవిద్య అగుటచే, అతి సులభముగా అనుకులు ఊడిపోగలవు కావున నే, శాశ్వత బంధముగా కొనసాగ తగిన వివాహపు విషయమున సామాన్యముగా వరుణ చేసదోషముగా ఏర్పడుచుండుట, ఇట్టి వరుణునికి నాలింటి చంద్రునిమండియూ, పదింటి యమునిమండియూ వింశుకేంద్రదేశ పుట్టినింటి పరిస్థితులలో, వృత్తిపద్ధతిలో, కంకణ ప్రాప్తికైనా, లేక దాంపత్య జీవనమునకైనా, ప్రతిబంధక సామగ్రిగా ఏర్పడగలవని దీని సూచన ఇట్టి వరుణుడు కుజక్షేత్రములో నిలిచి చండశాసనుడై నూటికి నూరువంతులుఫలమును తెచ్చి పెట్టుటకు వడుముకట్టుకొని సప్తమ భావ మధ్యమందే యుండగా, అతనిని వదలిపెట్టి ఎనిమిగా, ఎనిమిదింట ఎక్కడనో, కూర్చుండియున్న కుజునిపట్టి దద్దుకులాగ నీలకీ కన్నములో కూర్చుండియున్న దొంగకంటె దోషముకలవ కానరాకపోగా, కంచె ప్రక్కన కదుపుల మేపుచుండిన కన్నమ్మ కొడుకు కుంటరి

టమ్మా! అన్నిటికీ మించిన ఆ భూరాజానికో రాదు రాదటావు?"

ఆమె రౌద్రంగా చూసింది. శరీరమంతా పారు ఫంలో మండుకుపోతూంది. "నాకు పెళ్ళెవరూ తెలీదు నాకు తెలిసినవాడు అతుగో వాడొక్కడే మీ రంతా పొండి పోతారా లేదా?" ఆమె కసిరి వేసింది ఆమె నిప్పులు కక్కుతూంటే పిచ్చన్న కూడా గుల్ళ పడి భయపడ్డాడు ఆ ముదుసలి గంభీరమైన గొంతుక మళ్ళీ వినిపించింది. "ఓ అమ్మా! ఇప్పుడు ఒళ్లు బింకంతో వున్నావు నీకేమీ తెలీనిరాగు దేవుడూ లేడు! నీతీ లేదంటావ్ కాస్త వాడిపోగానే నీ దరికి పిడూ చేరరు ఎక్కడో మారుమూలల్లో గతిలేక చచ్చి నక్కలచేత, కుక్కలచేత, రాబందులచేత పీకించుకుంటావ్?"

"నేను చచ్చాక నాకేమైతే నేం? నేను చూడొచ్చానా? నాకు పిచ్చన్నతో నే బ్రతుకూ చావూనూ! వాడి చేతులతో నన్ను పొడిచినా నేను సంతోషంగా చచ్చిపోతాను ఈ లోకంలో వాడొక్కడు తప్పించి నాకెంకెవరూ లేరు."

అంటూ ఆమె అక్కడనుంచి గబగబ కదిలి పోయింది చుట్టూ మూగినవాళ్లు 'ఛీ ఛీ' అన్నారు తుప్పున వూశారు "అది మనిషి కాదు పసువు!" అన్నారు "దానికైనా కొంత నీతుంటాది దీనికి లేదన్నారు నానా దుర్భాషలూ ఆడారు. ఒక రూల తలపట్టుకొని కూర్చుండిపోయిన యజమానిని చూడ గానే పిచ్చన్న దగ్గరగాపోయి కాళ్లు పట్టుకొని వల వలా యేడ్చాడు.

"నా నౌకరుగా వుండొద్దు నాతో సరిసమా నంగా వుండు" అన్నాడు పిచ్చన్న గతుక్కుమన్నాడు అతని పాదాలొత్తడానికి పనికొస్తాడాతను యిన్ని అంతస్థులు లేదా!

"నీకు కొంతపొలం యిస్తాను. దున్నుకొని హాయిగా బ్రతకండి!"

ఈ మాటలు సంతోషంతో పాటు భయాన్ని కూడా కలిగించాయి. ఎందుకో గుండె దడపట్టుకుంది యీ భూమి యిచ్చి తన పిల్లాపాపతో బ్రతకమంటేనే! ఈ మెతోనా? ఈ రాయితోనా తన కాపరం? తప్పని చెప్పబోయాడు చెప్పలేకపోయాడు. అంతదూరంలో నున్న ఆమెను చూడగానే తనకు భయం వేసింది. తినంగిని చూచినట్లయింది మెల్లగా నిల్చు న్నాడు "రండి! ఇద్దరూ బండియెక్కండి" అన్నాడు ఆ గంభీర కాంత స్వరాన్ని పాటించే అల వాటుకొద్దీ పిచ్చన్న బండివేపు నడవగానే ఆమె ఆపడానికి పరుగెత్తుకు వచ్చింది "వద్దు వద్దు మళ్ళీ ఆ నరకానికి వెళ్లొద్దు మనం ఇక్కడే యిలాగ వుండిపోదాం ఒక్కసారి యిప్పుడు ఇక్కడే వచ్చి పోదాం!"

ఆమె ధాటికి పిచ్చన్న జంకిపోయాడు కాళ్లు కట్టేసినట్లు నిల్చుండిపోయాడు ఆమె భర్త ఒకసారి ఆమె వేపు తీరుగాదిగా చూశాడు ఆమె శరీరం జలద రిస్తోంది కోపంలో కంపిస్తోంది మతిచెడిన మనిషిలా కొద్దిగా పిచ్చిచేష్టలు అగపడ్డాయ్. అంతమందిలో పిచ్చన్న చెయిపట్టి లాగే ఆమె సాహసాన్ని చూసి పౌరుషాన్ని అపుకోలేక పోయాడు. బిగ్గరగా "దాన్ని త్రాళ్లతో కాళ్లు చేతులూ కట్టి బండిలో వెయ్యం"డని హుకుం జారీ చేశాడు

ఆ ఆజ్ఞ అరనిమిషంలో శిరసావహించడం జరి గింది బండి కదిలిపోతోంది ఆమె యెంత గుంజాటన పడినా లాభం లేకపోయింది ఊళ్లోవాళ్లు వున్న సామానులు బయట పడవేసి "నీలాంటి నీచురాలు మా వూళ్లో వద్ద"ని కేకలు వేశారు ఆమెకేమీ వినిపించలేదు బండి వెనుక పరుగెత్తింది కొంత దూరం పోయాక భర్త బండి ఆపించి "మీదికి రా!" అన్నాడు

"నేరాను పిచ్చన్న కట్లు విప్పు. ఎక్కడికో పోతాం!"

మళ్ళీ బండి తోలించాడు ఎంత బ్రహ్మాండమైన యెండ పొలాల త్రోవలోనుంచి యెడ్లబండి పరుగు తీస్తోంది ఆమె కాళ్లు బొబ్బ లెక్కిపోయాయి, స్నానం చేసినట్లు చెమట కారుతోంది. దాహం బ్రహ్మాండంగా వుంది కాళ్లు పట్లుతప్పి పీకేస్తు న్నాయ్ శరీరమంతా కందిపోయింది విరబోసిన జుత్తుతో వున్నకొద్దీ కక్షతో బండివెనుక పరుగెత్తు తోంది .. అదిగో ఊరు! ఒళ్లు స్వాధీనం తప్పుతోంది, ఎదురుగా బండి రెండు బళ్లుగా అగపడి. మసక మసగ్గా అగుపించి. ఒక్కసారి మాయమైపోయింది బండి ఆగింది మెలుకువ మూర్ఛపోయిన రాజమ్మను బండిమీద వేశాడు. నీరు చల్లాడు. ఆమెకు తెలివొచ్చే

సరికి చాల రాత్రయింది. మాట రాలేదు. తను ఎక్కడ వున్నాదీ సరిగా జ్ఞప్తి రాలేదు. ఆరి వేస్తున్నట్లు సైగ చేసింది. కడుపునిండా నసుక వచ్చింది కానీ ఒళ్లంతా పుల్లుదేరినట్లుంది. చుటూ మూగివున్న సజ్జనంవైపు చూడకుండా కళ్ళు మూసి పడుకుంది. తెలివి వున్నా నిద్రలో వున్నట్టే నటించింది. ఆ రాత్రంతా తన కాళ్ల వేపు దొడలో కుర్చీమీద కూర్చొన్నాడు. అప్పుడప్పుడలా నిసుగుతున్నాడు. చిన్న పిల్లవాడు యేడుస్తుంటే వెళ్లి ఓదారుస్తున్నాడు. ఆమె వుదయం లేచే సరికి కుర్చీమీద కూర్చొనే కునుకుతున్న భర్త అవుపించాడు.

'మళ్ళీ యీ కైగుల్లో యెందుకు తెచ్చావ్ దేముడా!' అనుకుంది. ఎవరితోనూ మాట్లాడ లేదు. ఎవరు మాటలు కలుపుతున్నా ముఖం త్రిప్పివేస్తోంది. తనకు కావలసినవన్నీ అడక్కుండా దగ్గరకు వస్తున్నాయ్. ఎప్పటికి చీకటి పడుతుందని యెదురుచూసింది. చీకటిపడింది. వడి రాత్రి కదలడానికి వీలులేకుండా భర్త కాపలా కాస్తున్నాడు. ఒకటి రెండుసార్లు లేవటానికి ప్రయత్నిస్తే మొగుడు యేం కావాలన్నాడు. జవాబు చెప్పకుండా పడుకుంది. ఈలోగా పుగాములు ప్రతిధ్వనిస్తున్నాయి. లేచి భర్తవేపు చూసింది. అలా కుర్చీ మీద కూర్చొనే చిన్న కూనుకు నిద్రపోతున్నాడు. కనులుండాము పేసరికి దబాదబా వర్షం ముంచుకొచ్చింది. ఆ వానజల్లుకు లేచిపోయాడు. కూర్చున్న గజమ్మను చూచి "నిద్దర రాలేదా?" అన్నాడు.

జవాబులేదు. కానీ అలా ఆమెవేపు దృష్టి సారించి చూశాడు. అతనిలో యేదో భావుకత్వం పొంగిపొరలింది. ఆమెపై సహజంగా తనకున్న అనురాగం ప్రస్ఫుటించింది. వికారం వేసింది. అరచేతిని ముడిచి కుడి అరచేతితో ముడిచిన తన చేతిని లాలిస్తున్నట్టు నిమురుతూ. "యేం కోరిక తీర్చుకోపోతే మనిషిగా అవుతావా? నీకు ఎందులోనో లోటు చేసివుంటాను. అందమూ మంచి కుదుర్చుకున్నా మాచేవాళ్ళకి ఒళ్ళు పులకరిస్తుందిగా. ఏమంటావ్!"

ఆమె నిష్ఠూరంగా "గంగలో దూకుతానంటాను!" అంటూ మళ్ళీ తెరబడిపోయింది.

"నీవు మంచివానివే. నీకోటంట అలాంటి మాటలు నోట్లోనికైనా రాకూడదు!"

"నీదే అంతా నిజం. నాదే అంతా అబద్ధంలే. ఊరుకో" అంది.

ఈ కాపురం ఎట్టి పాములపెట్టెలో పెట్టినా యింకా మచ్చిక చేయలేక పోతున్నానని పాములవాడు చిరుబుర్రులాడుతున్నాడు.

ఆ మరునాటి రోజు మధ్యాహ్నం. ఆ యేసరికి ఆ వూరికి ఆనుకుని తీరకాలంగా పారే యేరు ముంచుకు వచ్చింది. ప్రవాహం రానురాను పెద్దదై చీకటిపడే సరికి యేరు రెండు ఒడ్డులకు అంటుకొని పాగుతోంది. హోరుమనే శబ్దం మైలుదూరం వినిపిస్తోంది. వానలవల్ల చెరువులు నిండాయ్, కప్పలు బెక బెక పెప్పలు కొడుతున్నాయ్. కొలకులు నిండి పాలా గ్లోపారి పుభాలు మొదలుపెట్టించాయ్. మనిపాట్లలో భోజనం చేసుకోకుండా భర్త యింట్లో వేసినాడు. ఆమె ఆ గోజాన లేచి తల దువ్వుకుంది. చీర మార్చింది. ఒంటినిండా నగలూ ముఖంనిండా బొట్టు పెట్టుకుని పేరంటాలులా పసుపు రాసుకొని తయారయ్యింది. ఆమెలో మార్పును చూచి భర్త సంతోషపడ్డాడు. ఆ రాత్రి తనకు కంటి నిండుగా నిద్రపట్టింది.

వీమ్మక్కన్న ఒంటిగా తన యింటిదగ్గర మంచం వేసుకొని పడుకున్నాడు. కొంతదూరం పిల్లలు తనమీద సవారీచేసి సంతోషపెట్టి యింట్లో నిద్రపోతూగా తన వాటి పెళ్ళాం మాల్లాడి చాలా రాత్రయిందని పోయి ఇంట్లో పడుకుంది. చీకటిగావుంది. ఆకాశాన్ని నక్షత్రాలు మెరుస్తున్నాయ్. దగ్గరగావున్న యేటి గంభీరమైన ఆగాభు వినిపిస్తోంది. వీమ్మక్కన్నకు నిద్దర రావటం లేదు. తన యజమాని రాజమ్మ అంతా జ్ఞాపకం వస్తున్నాగా యజమాని వుదారస్వభావం తలుచుకుంటుంటే ఒళ్ళు పులకరిస్తోంది. మనసులోనే దేవుడికో సమానమైన మారాజని మొక్కుకుంటున్నాడు. రాజమ్మ సౌందర్యమంతా కళ్ళకు కట్టింది—ఎక్కడి కండ అక్కడ—ఎంతో పొందికైన ఒళ్ళు—మంచి సారా త్రాగినట్లుంది ఆమెతో సంసారం! ఆ క్షణంలో తన పెళ్ళాం తలపుకొచ్చింది. ఇద్దర్నీ పోల్చుకోవటం జరిగింది. ఇదా పుత్తి యెరిబాకులది—మొత్తినిముద్ద—అది తాగకుండా నా కన్నిసార్లు గొంతు పోసింది. దీని ఒళ్ళు కొస్తే అంతా మంచే! అబ్బ మారనే! కాకపోతే పనితిని పట్టుకొని పూమూరా తిరిగానెందుకు? యింటికి లేకపోయానా అని అరుకు

కాదా? ఇన్నేళ్లోసం అంత బ్రతుకూ కాలదన్నింది నీతో నేను సుఖపడ్డాను అదీ సుఖపడనీ—దాన్ని పెళ్లిళ్లాగ చూసుకుంటాను—దాని కింత పెడ్తాను—" ఇలాగన్నాడే యిదెక్కడని? కన్నకడుపులో పుట్టిన పిల్లలు అమ్మా అని యేడిస్తే మీదకొస్తే కదలేదు సొంత లేదు అదెక్కడిది? అది మనిషిప్పుడిక పుట్టలేదు దాన్ని కోసే అధికారమే లేదు అలాంటిది నాయింటి కొస్తే పులిలాగ వస్తా పెంగేస్తాది—దాని కడుపులో ఒక పిల్ల పుట్టే నా పిల కోకలు చినికేస్తాది! దానికి వూర్లోనే చోటు యిచ్చేవాడెవడు మాడు ముల్లూ కట్టానా రెండో మొండో ధరించదానికి? దానికి నాకు సమ్మంధం యేం వున్నాదని యిలా ఆలోచించుకుంటూవుంటే 'రాదనా' అతనిమీద చెయ్యి వేశాడు. గతుక్కుమని తలెత్తేసరికి రాజమ్మ సింగారించుకొనివచ్చిన కామినీ దేవతలావుంది పదపద అన్నది తొందరగా 'రాను' అని చెప్పటానికి నోరు కదలేదు లేదాడు. ఆమె గబగబ నడుస్తోంది ముందుకు మెల్లగా అడుగులు వేస్తున్న సిమ్మన్నను చూచి ఆగి "దా" అని పిల్చింది గబగబ తనకు తెలియకుండానే కాళ్ళు కదిలిపోయాయి

ఊరు దాటాగా, మొక్కల నీడలలో యేటిఒడ్డు వెంబడే త్రోవలో పోతూనే వెనుకవున్న వాడిని ముందు నడవమని ఆమె త్రోవ తిప్పుకుంది ముందుకు నాలుగు అడుగులు వేసి ఆగి ధైర్యం చిక్కబట్టుకొని యెక్కడికి అన్నాడు ఆమె గంభీరస్వరంతో "నీ వెనకనే వస్తాను మళ్ళ త్రోవగాని యింక దెబ్బలుగానీ గంగలోనికి గానీ గగనానికి గానీ ఎక్కడికైనా, నీతోనే వస్తాను తీసుకుపో" అంది

సిమ్మన్నకు కాళ్లు సరిగా ముందుకు పడటంలేదు. ఈ మైకాంశం అనురాగంకంటే అతీతమైన బంధం తనను వెనుకకు లాగుతోంది అదమనిషిలోవుంటే నూతనత్వం తెలుపుతున్నట్లు యింటివేపు తిరిగి పరుగెత్తమని ప్రోత్సహిస్తోంది పిలలపై కన్న తండ్రికి సహజంగా వుండే మమకారం మనసులో మథనం చేస్తోంది ఈ చెబ్బలని యిలా విడిపించుకోవటం—తన నిర్మలమైన బాటకు అడుగా కోసింది దోచుకుంటూ కలుపుకుంటూ బొబ్బలు పెడుతూ కదులుతున్న యేరు ప్రక్కనే వుందని స్ఫురించింది మనసు కఠినమైంది. కాగ్య నిముష్నదై ఆగాడు

ఆమె అతని భుజంమీద చెయ్యివేసి "చీకటని భయంగా వుందా?" అంది

"లేదులే " అన్నాడు

"పాము లుంటాయనా? అది నన్ను కరిస్తే—నేనూ కరిపించుకుంటానులే పద పద !" ఆమె కదలని అతనిని, తన అందమైన బాహువులలో చుట్టివేసింది ముఖంలో ముఖం పెట్టింది సిమ్మన్నలో సంచలనం కలిగింది ఆ నిశిలో నిశాచరుడయ్యాడు పువ్వులా తేలిగ్గా ఎత్తి వేసి ఉద్రేకంతో ఒక్కసారి గంగలోనికి త్రోసివేశాడు! తిరిగి యేమి తెలియనట్లు యింటి వేపు నిద్రపోడానికి పరుగెత్తాడు

రాజమ్మ చనిపోయి ఒక దశాబ్దం గడిచింది ఆ గ్రామం వస్తేవాళ్ళకి యేటిఒడ్డున ఒక మనిషి కనిపిస్తాడు యేటివేపు చూపిస్తూ "నన్ను రమ్మని పిలుస్తున్నాది! మీకు వినపడలేదా రాజమ్మ పిలుపు అదిగో అదిగో!" అంటాడు ఆ చుట్టుపట్లవున్న వాళ్ళు 'పిచ్చి సిమ్మడు బాబూ, రేయీ పగలూ అదే మాట అక్కడే వుంటాడు!" అంటారు

# కౌటిల్యుని అర్థశాస్త్రము

శ్రీ పి. వరహాలరావు

ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్ర చరిత్రలో కౌటిల్యుని అర్థశాస్త్రం అత్యంత ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తుంది. కౌటిలీయం, మనరాజనీతి శాస్త్రంపాలిట మహోన్నత భాండాగారం. దీన్ని రచించినవాడు కౌటిల్యుడు లేక చాణక్యుడు. ఇతను తక్షశిలానగరంలో జన్మించాడని కొందరు, ద్రవిడ దేశస్థుడని మరికొందరు ఊహిస్తున్నారు. ఇతను ఆంధ్రుడనే ప్రవాదంకూడా ఉంది. ఏది ఏమైనా, ఈయన జన్మస్థానం యిది అని చరిత్రపండితులు యిదమిత్థంగా తేల్చలేదు. ఈయన వేదవేత్తయే గాక నాటికాలపు విద్యలన్నిటినీ, సమగ్రంగా అభ్యసించిన వాడు. తక్షశిలావిశ్వవిద్యాలయంలో విద్యార్థిగావున్న దినాల్లోనే కూటముద్రలు (దొంగ నాణెములు) తయారుచేసేవాడనీ, 'కుంటనక్క' వంటి తెలివితేటలుగలవాడనీ ప్రతీతి. "ముద్రారాక్షస" నాటకకర్తయైన విశాఖదత్తుడు "కౌటిల్యః కుటిలమతిః" అని ఒక పాత్రచే యీయన శీలాన్ని అభివర్ణింపచేశాడు.

కౌటిల్యుడు "అర్థశాస్త్రాన్ని" క్రీ పూ 300 ప్రాంతాల రచించి వుంటాడు. కాంతిలోకి వచ్చిన నాటినుండీ యీ మహాగ్రంథం కీర్తి చంద్రికలు, సూర్యకిరణాల్లాగ దశదిశలా వ్యాపించాయి. క్రీ శ. 8 వ శతాబ్దంలో జీవించిన కామందకుడు తన "నీతిసారం"లో కౌటిలీయ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ ప్రశంసించాడు. శాస్త్రాంబుధిలోనుండి కౌటిలీయమనే రాజనీతి శాస్త్రామృతాన్ని ఉద్ధరింపచేసిన మహోన్నత ప్రతిభాశాలిగా కౌటిల్యుణ్ణి వర్ణించాడు. క్రీ శ 8 వ శతాబ్దంలో జీవించిన భవభూతి తన 'మహావీరచరిత్ర'లోను, భవభూతికి 50 సంవత్సరాలకు పూర్వమున్న మహాకవి దండి తన 'దశకుమారచరిత్ర'లోను, క్రీ శ 5 వ శతాబ్దంలో వ్రాయబడిన 'నారదస్మృతి'లోను, కౌటిలీయార్థశాస్త్రం ప్రస్తావించబడడం గమనార్హం. వ్యాయభాష్యము క్రీ శ 850 లో వ్రాయబడిన 'యాజ్ఞవల్క్యస్మృతి'లాంటి ధర్మశాస్త్రగ్రంథాలు, మేధాతిథి, మల్లినాథుడూ వంటి సుప్రసిద్ధ వ్యాఖ్యాతలూ కూడా, కౌటిలీయాన్ని పేర్కొన్నారు. ఇంతటి మహామేధావుల, ఉద్దండ పండిత ప్రకాండుల దృష్టి ఆకర్షించిన యీ గ్రంథం కొంతకాలం అదృశ్యమైపోయింది.

మౌర్యచంద్రగుప్తుని ఆస్థానంలోవున్న గ్రీసు రాయబారి మెగస్తనీసు, తన 'ఇండికా' గ్రంథంలో చంద్రగుప్తుని గూర్చి విశేషమైన సమాచారాన్ని అందించి, మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించి, చంద్రగుప్తుని ప్రధానామాత్యుడుగావుండి, దైనందిన రాజ్యకార్య నిర్వహణలో పాల్గొనిన కౌటిల్యుని పేరును పేర్కొనకపోవటం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే! దీన్ని ఆధారంగా చేసికొని, కొందరు పాశ్చాత్య, భారతీయ పండితులు కౌటిల్యుడు ఫుక్కిటి పురాణానికి చెందిన వ్యక్తి అనే నిర్ణయానికి వచ్చారు. ఐతే వారి సందేహాలు, నిర్ణయాలు, నిరాధారాలని చరిత్ర రుజువుచేసింది.

కొన్ని శతాబ్దాలాదిగా ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రం పాలిట కామధేనువులా ఉన్న 'అర్థశాస్త్రం' కొంతకాలం మరుగునపడిపోయి, 20 వ శతాబ్ది ప్రారంభంలో, 1900 ప్రాంతాన డాక్టరు శ్యామశాస్త్రిచే కనుగొనబడింది. ఆయన యీ గ్రంథంలోని కొన్నిభాగాలు ఇంగ్లీషు భాషలోనికి అనువదించి ప్రచురించారు. దాంతో యూరపియన్ పండితులు, ప్రత్యేకంగా జర్మన్ సంస్కృత విద్వాంసులు, దీన్ని అధ్యయనం చేసి పరిశోధనలు ప్రారంభించారు. అంతేకాక, ప్రాచీన హైందవులకు స్వతంత్ర అర్థశాస్త్రమంటూ, ఒకటి లేదని ప్రచారం చేసిన యూరపియన్ పండితుల దృక్పథంలో కౌటిలీయ పునర్దర్శనం విప్లవాత్మకమగు మార్పును తీసుకువచ్చింది. అంతేగాద, కౌటిలీయానికి పూర్వము, తదనంతరము ఎన్నో రాజనీతిగ్రంథాలు వ్రాయబడ్డాయి. అవన్నీ కౌటిలీయంలా, ఏదో ఒకనాడు వెలుగులోకి రాకుండా మానవని ఆశిద్దాము.

కౌటిల్యుడు 'అర్థశాస్త్రాన్ని' రచించేందుకు సూత్రశైలి ఉపయోగించాడు. అందుచేత, ఆయన అభిప్రాయాలు అతినిగూఢంగా కన్పిస్తాయి. గ్రంథంలో ఉపయోగించిన పరిభాష, ఇక్కడ సంస్కృతగ్రంథాల్లో గానీ, నిఘంటువుల్లో గానీ కన్పించదు. కౌటిల్యుని పిదపవచ్చిన గ్రంథకర్తలు ఎవ్వరూ ఆయనలా రాజ్యపాలనకు సంబంధించిన విషయా

అన్నిటినీ విపులంగా వివరించలేదు. కౌటిలీయంలో ఉన్న అన్యత్ర ప్రచార ధర్మసూత్రీయ యాజ్ఞవల్క్యాది అధికరణాలను కూర్చిన ప్రకరణాంశంలోని కామందకుని "నీతిసారం"లోగానీ, శుక్ర "నీతిసారం"లోగానీ లేవు కాబట్టి రాజ్యాంగతంత్రం కూర్చి ప్రాచీన శాస్త్రవేత్తలు చేసిన సిద్ధాంతపరిశానికి కౌటిలీయమే ప్రధానమైన ఆధారం

కౌటిలీయం అవతరణ కాలంనాటికి భారతదేశంలోని విభిన్నపరిస్థితులు అస్తవ్యస్తంగా తయారయ్యాయి మాసిడోనియా దేశస్థుడయిన అలెగ్జాండరు, ప్రపంచాన్ని జయించాలనే వాంఛతో జైత్రయాత్ర ప్రారంభించాడు పారసీక సామ్రాజ్యాన్ని తన పాదాక్రాంతం చేసికొని, హిందూకుష్ పర్వతాలు దాటి, క్రీ. పూ. 326 లో భారతదేశంపై దండెత్తాడు ఆ నాటికి, ఉత్తర భారతదేశంలో చిన్న చిన్న రాజ్యాలు అసంఖ్యాకంగా వున్నాయి అవి నామకులే, నిరంతరం కలహాంతిప్త మనో వ్యాపకంలేని రాజులు, భోగభాగ్యాలనుభవిస్తూ, బతుకుతున్న గణాలవి పంజాబ్ చిన్న చిన్న భాగాలక్రింద చీలిపోయింది దేశం ఐక్యము, క్షేమము మరిచి, విదేశీ శత్రువు దేశ స్వాతంత్ర్యాన్ని దొంగిలించ సిద్ధపడ్డప్పుడుకూడా, నాటి క్షుద్రులైన రాజులు, (పురుషోత్తముని వంటి రాజులు తప్ప) పరస్పరం కుత్తుకలు త్రెంచుకొనే యత్నంలో ఉన్నారు అలాంటి పరిస్థితులలో అలెగ్జాండరు దండెత్తాడు అలెగ్జాండరు దండయాత్ర భారతదేశ రాజకీయాకాశాన్ని తాత్కాలికంగా ఆవరించిన కారుమేఘం ఇది వెంటనే అదృశ్యమైంది

గ్రీకు దండయాత్ర కొన్ని సత్ఫలితాలనూ, కొన్ని దుష్ఫలితాలనుకూడా కలుగజేసింది గ్రీకు దండయాత్ర ఫలితాలు, హిందూసంఘం ఆచార వ్యవహారాలను కొంతవరకు కలంకితం చేశాయి. కొందరు రాజవంశస్థులు, గ్రీకు సేనాధిపతులకు తమ కన్యల నిచ్చి వివాహమొందారు. మౌర్య చంద్రగుప్తుడు, సెల్యూకస్ కూతురును వివాహమాడాడు దీని ఫలితంగా హిందూ సంఘంలో వర్ణసాంకర్యం ప్రారంభమైంది వైదిక మతానికి దుర్గతి ప్రాప్తించింది నాటి కాలంలో, దేశంలో జైన బౌద్ధాలు ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి కౌటిల్యుని కాలంనాటికి, మగధరాజ్యాన్ని నవనందులు పాలిస్తున్నారు నందులలో చివరివాడైన ధననందుడు ప్రజాద్రోహిగా తయారై, ప్రజల్ని హింసించడం జరిగింది అలాంటి పరిస్థితులలో, ప్రజాకంటకంగా తయారైన నందరాజులపాలన మదమణచింప చేసి, వైదికమతాన్ని పునరుద్ధరించేందుకు, కౌటిల్యుడు కంకణం కట్టాడు. మహోన్నతుడైన చంద్రగుప్తుడు, అనన్య సామాన్య ప్రతిభాశాలి, అఘటనఘటనా రాజనీతి శాస్త్రపారంగతుడైన కౌటిల్యుడూ కలిసి, బ్రహ్మాండమైన సైన్యాన్ని సమకూర్చి, నందులను ఓడించారు మగధరాజ్యాన్ని వశపరచుకొన్నారు ప్రాచీన హైందవ రాజకీయాకాశంలో మినుకు మినుకు మినుకు మంటూ, అమూల్య దివ్యకాంతిలో ప్రకాశించిన అదియుగాల సంఘాలు కాలక్రమేణా మౌర్య సామ్రాజ్యంలో సైనిక శక్తి ప్రభావంతో కబళించివేయబడ్డాయి. ఈ విధంగా భారతదేశ చరిత్రలో, మొట్టమొదటిసారిగా, సువిశాలమైన మౌర్య సామ్రాజ్య అవతరణం జరిగింది.

## కౌటిల్యుడు . వైదికధర్మపరత్వం

కౌటిల్యుడు వైదికమతంపై అధిక తరమయిన అభిమానం చూపాడు ఈతని వైదిక ధర్మ పరత్వానికి కౌటిలీయార్థశాస్త్రంలోనే ఎన్నో నిదర్శనా లున్నాయి. కామందకుడు కౌటిల్యుని శాస్త్ర పాండిత్యాన్ని, వైదిక ధర్మపరత్వాన్నీ, అసాధారణ ప్రతిభనీ యీ విధంగా ప్రశంసించాడు

"వంశే విశాల వంశ్యానాం ఋషీణా మివ భూయసాం
అప్రతిగ్రాహకాణాం యో బభూవ భువి విశ్రుతః
జాతవేదా ఇవార్చిష్మాన్ వేదాన్ వేదవిదాం వరః
యోఽధీతవాన్ సుచతురః చతురోఽప్యేక వేదవత్
యస్యాభిచార వజ్రేణ వజ్ర జ్వలన తేజసః
పపాత మూలతః శ్రీమాన్ సుపర్వానందపర్వతః
ఏకాకీ మంత్రశక్త్యా యః శక్త్యా శక్తిధరోపమః
ఆజహార నృచంద్రాయ చంద్రగుప్తాయ మేదినీమ్
నీతిశాస్త్రామృతం ధీమాన్ అర్థశాస్త్రమహోదధేః
సముద్దధ్రే నమస్తస్మై విష్ణుగుప్తాయ వేధసే"

అప్రతిగ్రాహకమైన ఉత్తమ ఋషి వంశంలో వుద్భవించి, తేజస్సుతో నాలు వేదాలనీ ఒక వేదంలా అధ్యయనంచేసి, సర్వశాస్త్ర నిష్ణాతుడై, పవిత్ర జీవనమున యాగాగ్నిలా ప్రకాశించి, అర్థ ధర్మ రక్షణకొరకు విదేశీ విజృంభణాన్ని అరికట్టి, అద్భుత మంత్ర సామర్థ్యంతో, నందపర్వతాన్ని, గిరి పిడుగులా ఒంటరిగా స్వశక్తితో నిర్మూలించి, మౌర్య చంద్రగుప్తునికి చక్రవర్తిత్వాన్ని సాధించి, అర్థశాస్త్రాంబుధినుండి నీతిశాస్త్రామృతాన్ని పుష్పింపచేసినమహోన్నత ప్రతిభాశాలిగా, కౌటిల్యుణ్ణి, కామందకుడు ప్రశంసించాడు. వైదికధర్మపరత్వం, మౌర్యసామ్రాజ్య స్థాపన తత్పరిపాలన ఇవే కౌటిల్యుని ప్రధానాశయాలు అందుకనే తాను రచించిన అర్థశాస్త్రంలో వేదాలకు, చాతుర్వర్ణ్య చతు

రాష్ట్రీయాలకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చాడు. రాజ్యాన్ని పరిపాలించే రాజకుమారులు, చిన్ననాటి నుండీ వేదవిద్యలు, ధార్మిక న్యాయశాస్త్రాలు, అధ్యయనం చేయాలని, నిర్దేశించాడు. రాజకుమారుడు ప్రాతఃకాలాన శస్త్రశిక్ష, గజ ప్రహరణాలు అభ్యసిస్తూ, మధ్యాహ్నం పూట మహాభారత రామాయణేతిహాసాలని వింటూ శాస్త్రాలలో శిక్షణ పొందాలంటాడు. నాలుగు వర్ణాలు కలిగి, నాలుగు ఆశ్రమాలు కలిగిన లోకమని చెప్పాడు. ఇలాంటి లోకం రాజదండంచే పరిపాలించబడితే 'స్వధర్మ కర్మాభిరతిమై తమ తమ మార్గాల్లో ప్రవర్తించుచున్న' దంటాడు. హిందూసంఘమందలి నాలుగు వర్ణాలకు చెందిన ప్రజలు ఈ క్రింది వృత్తుల్ని స్వీకరించాలంటాడు. బ్రాహ్మణునికి అధ్యయన అధ్యాపన యజన యాజన ప్రతిగ్రహములు, క్షత్రియునికి అధ్యయన యజన యాజన ప్రతిగ్రహములు, వైశ్యునికి అధ్యయన యజన యాజన దానకృషి పాశుపాల్య వాణిజ్యములు శూద్రునికి బ్రాహ్మణ క్షత్రియ వర్ణాల శుశ్రూష, వార్తా కారుకుశీలవకర్మలు స్వధర్మాలు. 'స్వధర్మము ననుసరించుట స్వర్గానంత్యములకొరకే' నని ఖండితంగా చెప్పాడు. స్వధర్మాన్ని అతిక్రమిస్తే వర్ణసాంకర్యం వల్ల లోకం నశిస్తుంది. కాబట్టి ప్రభువు ప్రజల్ని స్వధర్మాన్నుండి దూరం కానివ్వరాదు. స్వధర్మ పరిపాలకుడు, ఆర్యమర్యాదా వ్యవస్థాపకుడు, వర్ణాశ్రమ ధర్మస్థితికర్తయైన రాజు ఇహపర సుఖాలు పొందుతాడు. అప్పుడు లోకం త్రయీ (మూడు వేదాలు) చేత రక్షించబడి వృద్ధిచెందగలదని చెప్పాడు. 'లోకంలోని చాతుర్వర్ణ్య చతురాశ్రమాలను, నాశనముకాని నిర్దిష్టమైన స్వధర్మాలను, రక్షించడం చేతనే రాజు ధర్మపాలకుడు అవుచున్నాడు' (ధర్మస్థేయం—అర్థశాస్త్రం) హిందూ సమాజమందలి ప్రజలలో ఏకమత్యభావాన్ని పెంపొందించుటకు, వర్ణవ్యవస్థ ప్రవేశపెట్టాలని కౌటిల్యుడు నిర్దేశించాడు. ఈ వర్ణవ్యవస్థ పటుబడితే లోకజీవితం సంక్షోభంలో పడిపోతుందని చెప్పాడు. ప్రజాజీవితం సంక్షుభితం కాకుండా వుంచేందుకు, ప్రజలు ఐహికాముష్మిక సుఖాలుపొందేందుకు రాజు వర్ణాశ్రమ ధర్మాన్ని రక్షించాలి. అలా కాపాడకుండా వర్ణ సాంకర్యాన్ని ప్రోత్సహించి, ధర్మశాస్త్రాలని తిరస్కరించితే, రాజు పదవిభ్రష్టుడు చేయబడతాడు.

## కౌటిల్యుడు పూర్వశాస్త్రకారులు

'అర్థశాస్త్రం' అనే పేరుతో రాజధర్మాన్ని విపులంగా వివరించే గ్రంథరాజాన్ని వ్రాయడం శాస్త్ర సిద్ధాంతాల ననుసరించి దిగంత విశ్రాంతమైన మౌర్య సామ్రాజ్యాన్ని చంద్రగుప్తుని సహాయంతో స్థాపించడం, యీ రెండు కారణాలవల్ల, కౌటిల్యుడు ప్రాచీన హిందువార్థ శాస్త్ర చరిత్రలో అగ్రగణ్యుడైన శాస్త్రవేత్తగను, భారతదేశ చరిత్రలో ఒక మహోన్నతుడుగాను, పరిగణింపబడుతున్నాడు. శాస్త్ర సిద్ధాంతాలను ప్రతిపాదించడంలో నే గాకుండా, వాటి మంచిచెడ్డలు ఆచరణలో నిరూపణ చేయడంలో కూడా, కౌటిల్యుడు అసదృశ పాండిత్యమైన ప్రజ్ఞను ప్రదర్శించాడు. అతడు పూర్వ శాస్త్రవేత్తల సిద్ధాంతాలు, సూత్రాలు, కొంతవరకు అంగీకరించాడు. కొన్ని సందర్భాలలో, ఆ సిద్ధాంతాలకు కొన్ని తీవ్ర సంస్కరణలుకూడా చేశాడు. మరికొన్ని సందర్భాలలో పూర్వసిద్ధాంతాల్ని ఖండించి సంపూర్ణముగ స్వతంత్ర సిద్ధాంత ప్రతిపాదన కుద్యమించాడు.

కౌటిల్యునికి పూర్వమున్న శాస్త్రవేత్తలు ప్రతిపాదించిన సూత్రాలు, ధర్మానికి ఉక్కుచట్రంలో బంధింపబడ్డాయి. పూర్వ శాస్త్రకారులు "అర్థం" కంటే ధర్మాన్నిగూర్చి అధికంగా చెప్పారు. ఆ ధర్మశాస్త్ర నియమాలకు అర్థశాస్త్ర సూత్రాలు కట్టుబడి వుండాలని, నిర్దేశించారు. కాలచక్రం గిర్రున తిరిగింది. పరిస్థితులు మారిపోయాయి. పూర్వం చెప్పబడిన ధర్మసూత్రాలు కాలానుగుణంగా మారుతున్న పరిస్థితుల కనుగుణంగా మారక, యాంత్రికంగా తయారయ్యాయి. అలాంటి పరిస్థితులలో, మారుతున్న కాలానికి అనుగుణంగా అర్థశాస్త్ర సూత్రాలను కొన్నిచోట్ల సంస్కరించాడు. కొన్ని విషయాలలో మూల సిద్ధాంతాలే మార్చాడు. ఉదాహరణకు—కౌటిల్యునికి పూర్వమున్న ధర్మశాస్త్రకారులు విధవా వివాహాలుగానీ, వివాహబంధ విమోచనాన్నిగానీ అంగీకరించలేదు. కాని కౌటిల్యుడు కాలానుకూలంగా, వివాహ బంధ విమోచనం, ప్రోషిత భర్తృకలకు, మృత భర్తృకలకు పునర్వివాహాలు, యువతులకి స్వయంవరణము ఇత్యాది తీవ్రసాంఘిక సంస్కరణలు హిందూ సంఘంలో అతి ధైర్యంగా ప్రవేశపెట్టాడు. దైనందిన రాజ్యపాలనలో కోరలు తీరిన, రాజనీతిజ్ఞుడుగా వ్యవహరించాడు.

రాజ్య పాలనా రంగంలో కూడా అతడు మార్పులు ప్రవేశపెట్టాడు. రాజులు తమ రాజ్యాలలో గూఢచారి దళాలను విస్తరించాలని, భేదోపాయాలచే శత్రువును వెనగించి తెగటార్చాలని, శత్రురాజులకు వ్యతిరేకంగా ఆ రాజ్య ప్రజలలో ద్వేషం కలుగజేయాలని చెప్పాడు. ఈ "కుటిల" మార్గాలు, పరంపరానుగతంగా వస్తున్న ధర్మసూత్రాలను నిలువునా ఖూనీ

# కౌటిల్యుని అర్థశాస్త్రము

చేస్తాయని పూర్వ పండితులు తలచి, ఆయనపై కత్తులు నూరారు. కౌటిల్యుడు రాజ్యపాలనా సౌష్ఠవాన్ని పటిష్ఠం చేసేందుకు ప్రవేశపెట్టిన సంస్కరణలు, సూచించిన మార్గాలు ప్రాచీన ధర్మశాస్త్రవేత్తల యాంత్రిక సూత్రాలకు వ్యతిరేకంగా తయారయ్యాయి. కనుక కంటకాలు నివారించేందుకు, రాజ్యంలో విప్లవం, శత్రుదండయాత్ర, మొదలైన అత్యవసర పరిస్థితులు హఠాత్తుగా సంభవించినప్పుడు, ప్రభుత్వ కోశంలో ధనం లేకపోతే సంపన్నులనుండి బలవంతంగా డబ్బు గుంజడం, దుర్మార్గుల పొలాలను బలప్రయోగంతో స్వాధీనం చేసుకోవడం, ప్రజల మూఢమత విశ్వాసాలను ఆసరాగా తీసుకొని అధర్మమార్గాల ద్వారానైనా ధనం సంపాదించడం - ఇవి రాజ్యం యొక్క శాంతి భద్రతల దృష్ట్యా, సుస్థిరత్వ దృష్ట్యా అత్యవసరమని కౌటిల్యుడు స్పష్టంగా ప్రతిపాదించాడు. కాని ధర్మశాస్త్రకారులు యీ ప్రతిపాదనలపై విరుచుకుపడ్డారు.

ధర్మగ్లాని కలుగుతుందని, కారాలు మిరియాలు నూరారు. ఐనా వారి విమర్శలకీ, ఆ వేళ శాపనార్థాలకీ యెటువంటి లెక్క చేయకుండా వల్లెగపై బండిని తోలినట్లు తన మార్గాన తాను ప్రయాణించాడు చాణక్యుడు!

సాంప్రదాయ రాజకీయారంగంలో అధికార దాహంతో వుండేవారు ఎలా వ్యవహరిస్తారో కూడా విశదీకరించాడు. ఈ ప్రవర్తన శాస్త్రయుక్తమైనా, ధర్మబద్ధమూ అనే మీమాంసకు అతడెట్టి ప్రాధాన్యం యివ్వలేదు. శత్రువులను ఓడించడంలో మోసం, అసత్యప్రచారం, కుట్రలూ కుహకాలూ,— యివన్నీ ఉపయోగించదగిన సాధనాలని కౌటిల్యుని అభిప్రాయం. ఈ సందర్భంలో ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి అభిప్రాయాన్ని ఇక్కడ ఉల్లేఖిస్తాను. "చాణక్యుని ప్రపంచము నైతిక ప్రపంచముగాని, ఆదర్శ ప్రపంచముగాదు. రాజులు ఎట్టి మార్గముల ననుసరించుచుండెదరో వివరించుటయే అతని ఉద్దేశ్యము. న్యాయాన్యాయములు, ధర్మాధర్మములు విధించుటకు అతడు ప్రయత్నించుటలేదు. అతని గ్రంథమును, అందులోని సూత్రములను విమర్శించువారు ఈ విషయమును జ్ఞాపకముంచుకొనవలయును. శత్రువును మోసపుచ్చి ఓడించుట న్యాయమా అన్న విషయమును అతడు వివరించుటలేదు. శత్రువును, వంచించి వశపరచుకొనుట సర్వసాధారణమని నిరూపించుటయే అతని ఉద్దేశ్యము."

ఉత్తమ లక్ష్యమును పొందుటకు వక్రమార్గాన్నైనా అనుసరించాలని అతని మతం. రాజ్యభద్రతకు, సుస్థిరతకు ఘోరవిపత్తు వాటిల్లినప్పుడు, శత్రువును ఎదుర్కొనుటకు డబ్బు అవసరమైతే, అధర్మమూ, వక్రమూ, దౌర్జన్యయుతమూ ఐన మార్గం ద్వారా సంపాదించినా ఎలాంటి తప్పులేదని అతడంటాడు. దీనికో ఉదాహరణ యిచ్చాడు. ఒక గోవును కసాయి వేటకాడొకడు తరుముకొని వస్తాడు. ఆ ఆవు పారిపోయివచ్చి ఒక పరమ సత్యవ్రతుని ఆశ్రమంలో దాక్కున్నది. వేటకాడు పరుగెత్తుకొని వచ్చి "ఆవు యీ దారిన పోయిందా?" అని అడిగితే, సత్యాన్ని చెప్పి గోవును కసాయికత్తికి ఒప్పగించాలా? లేక అసత్యం పలికి దాన్ని రక్షించాలా? ఆ సమయంలో ఎంతటి సత్యవ్రతుడైనా, అబద్ధమాడైనా ఆవును రక్షించడం ధర్మం, న్యాయం — అంటాడు కౌటిల్యుడు. 100 అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చేయమనే పెద్దల మాట! ఉత్తమ సాధ్యాలను అయోగ్య సాధనాల ద్వారానైనా సాధించవచ్చు సాధించాలి అని అంటాడు. ఈ ప్రతిపాదన విధానంలో చేసినవాడు, 19 వ శతాబ్దంలో జీవించి, జర్మన్ సామ్రాజ్య వాదానికి పునాదులు వేసిన అనన్యసామాన్య రాజనీతిజ్ఞుడు బిస్మార్క్. అంతకుపూర్వం క్రీ. పూ. 4 వ శతాబ్దంలోనే, మగధలాంటి అతి చిన్న రాజ్యాన్ని తన యుక్తిచే, ప్రజ్ఞచే దిగంత విశ్రాంతమైన మౌర్య సామ్రాజ్యంగా విస్తరింపజేసిన మహోన్నత ప్రతిభాశాలి కౌటిల్యుడు.

## మేక్ వెల్లి

సాధ్యాలు సాధనాలను సమర్థిస్తాయి అనే సిద్ధాంతాలను ప్రతిపాదించిన మరో రాజకీయ తత్వవేత్త—ఇటాలియన్ దేశీయుడైన నికోలో మేక్ వెల్లి. ఇతను "ప్రిన్స్" (Prince) అనే ప్రపంచ ప్రఖ్యాత గ్రంథం రచించాడు. రాజులు తమ గమ్యాన్ని చేరుటకు, తాము వాంఛించిన లక్ష్యాన్ని సాధించేందుకు ఎలాంటి కుట్రలనైనా చేయవచ్చుననీ, మోసాలు, అసత్యాలు, దుర్మార్గాలనైనా చేపట్టవచ్చుననీ, అతి నగ్నంగా ప్రతిపాదించాడు. ఈ మార్గాల ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నాటి 16 వ శతాబ్దపు రాజులు, రాజకీయ వేత్తలు, మతగురువులు అనుసరిస్తున్నప్పటికీ, వారంతా మేక్ వెల్లి సిద్ధాంతాలను నోరారా తిట్టి కారాలు మిరియాలు నూరారు. వీరు ఏ మార్గాలనైతే రహస్యంగాను, బహిరంగంగాను, ఆచరణలో పెట్టారో, వాటిని సిద్ధాంతీకరిస్తూ బహిరంగ ప్రచారం చేయడమే మేక్ వెల్లీ చేసిన 'ద్రోహం

దమైన నేరం' అందుకని నాటి క్రిస్టియన్ నీతి శాస్త్రవేత్తలు, పీఠాధిపతులు, ఆయనమీద ఒక్కుమ్మడిని విరుచుకుపడ్డారు. ఈ విషయాన్నిగూర్చి ప్రొఫెసర్ మాక్సీ యిలాగంటాడు—

"Niccolo Machiavelli is perhaps the most universally reprobated figure in the history of political philosophy, the man whose precepts are universally disavowed in principle, but regularly followed in practice Yet Machiavelli was a moral man according to the conventions of his time and apparantly also a man of considerable culture and charm"

కౌటిల్యుని కాలంనాటికి భారతదేశంలో ప్రధానంగా ఉత్తరభారతంలో చిన్న చిన్న రాజ్యాలు అసంఖ్యాకంగా వుండేవి రాజకీయ ఐక్యం కరిమింగిన వెలగపండులా అదృశ్యమైపోయింది. నిరంతరం అంతఃకలహాలలో యీ రాజ్యాలు ముక్కలవుతూ కునారిల్లాయి. రాజకీయమైన ఐక్యం నశించి శాంతిభద్రతలు క్షీణించిన విపత్కర పరిస్థితులలో కౌటిల్యుడు ఉద్భవించాడు అలాంటి పరిస్థితుల్లో భారతదేశాన్నంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందకు తీసుకువచ్చి తద్వారా ఐక్యభారత నిర్మాణమే కౌటిల్యుని ఏకైకలక్ష్యం ఈ మహత్తర లక్ష్యసిద్ధికే, ఆయన అర్థశాస్త్రరచన కుపక్రమించాడు

ఇదే విధమైన అనైక్యం, అంతః కలహాలు, శాంతిభద్రతలలేమి మేకావెల్లి జీవించిన ఇటలీలో వుండేవి అలాంటి విచ్ఛిన్నకర పరిస్థితులనుండి మాతృదేశాన్ని రక్షించి ఏకీభూతమయిన ఇటలీ సంస్థాపన కోసం మేకవెలీ తన సుప్రసిద్ధగ్రంథం రచన చేశాడు

మానవవ్యవహారంలో అధికార దాహం అంతర్గర్భితంగా వుందంటాడు కౌటిల్యుడు ఆ అధికార దాహంలోని కౌటిల్యాన్ని, వంచనీ అనూహ్యమైన కుట్రనీ ఉన్నది వున్నట్లుగా అతడు పరిశీలించి వివరించాడు ఇదేపని మేకవెలీకూడా చేశాడు కౌటిల్యునికి పూర్వమున్న ధర్మశాస్త్రవేత్తల దృక్పథం ఇందుకు భిన్నమైంది అది ఆదర్శాల పుట్ట, ఆచరణకి ఎంతో దూరం ధర్మశాస్త్రవేత్తలు రాజ్యాదర్శాలను, వాటిని సాధించేందుకు వినియోగించదగిన మార్గాలను వివరించాడు. కౌటిల్యుడు దీనితో భేదించాడు ఆదర్శప్రాయమగు రాజ్యాన్ని (Republic) "స్వర్గలోకంలో" సృష్టించిన ప్లేటోతో ఆయన శిష్యుడు అరిస్టాటిల్ ఎలా అంగీకరించలేదో, అలాగే పూర్వ ధర్మశాస్త్రవేత్తల జనప్రాయమైన ఆదర్శప్రాయమైన, కేవల ధర్మబద్ధమైన మార్గాలనుండి కౌటిల్యుడు భేదించి, ఆచరణయోగ్యము మారుతున్న సమాజ పరిస్థితుల కనుగుణము అయిన మార్గాన పయనించినాడు అర్థశాస్త్రగమ్యాన్ని మరో మార్గంవేపు మళ్లించి, ధర్మశాస్త్రానికి భిన్నమైన స్వతంత్రశాస్త్రంగా నిర్మించాడు ఇది ఆయన శేముషికి ఎదురులేని తార్కాణం అందుకనే కౌటిల్యుడు ప్రాచీన హైందవ అర్థశాస్త్ర చరిత్రలో అజరామరుడయ్యాడు నాటి పండితలోకంలో అర్థశాస్త్రగ్రంథాన్ని పునికొల్పి మరణ సదృశంగావున్న శాస్త్రానికి తిరిగి జీవంపోశాడు అందుకనే కామందకుడు తన "నీతిసారం"లో, కౌటిల్యుణ్ణి అవతార పురుషునిగా ప్రశంసించాడు

## కౌటిలీయం - అర్థశాస్త్ర నిర్వచనం

కౌటిల్యుడు అర్థశాస్త్రాన్ని యిలా నిర్వచించాడు "అర్థం" అంటే ప్రజలతోకూడిన ఒక ప్రత్యేక భూభాగం (జనపదం) ప్రజలతోకూడిన ఒక ప్రత్యేక భూభాగాన్ని సంపాదించి, దాన్ని ఆ మరతింపరలా అభివృద్ధిచేయుటకు అనువైన వివిధ మార్గాలను పరిశీలించు శాస్త్రమే—అర్థశాస్త్రం (That Science which deals with the means of acquisition and growth of territory).

"మనుష్యాణాం వృత్తిరర్థః
మనుష్యవతీ భూమిరిత్యర్థః
తస్యా పృథివ్యా లాభపాలనోపాయః శాస్త్రం
అర్థశాస్త్రం ఇతి" (అర్థశాస్త్రం—పేజీ 426)

మానవులకు బ్రతికేందుకు మూలాధారం అర్థం అర్థం అంటే ప్రజలతో కూడిన భూభాగం కాబట్టి ఆభూభాగాన్ని ఎలా సంపాదించాలో, ఎలా భద్రపరచాలో, వివరించు శాస్త్రమే—అర్థశాస్త్రం

రాజదండాన్ని నిరంతరం సమ్యక్ రీతిలో ఉపయోగించడమే "దండనీతి" అని నిర్వచించాడు కౌటిల్యుడు ఈనీతిలో నాలుగు ప్రధాన విషయాలు గర్భీకృతమై వున్నాయి

1 ఏదైతే లభ్యంకాలేదో దాన్ని సంపాదించడం, (అలబ్ధ లాభార్థ)

2 ఏదైతే లబ్ధమైనదో దాన్ని భద్రపరచడం, (లబ్ధ పరిరక్షణం)

3. అలా భద్రపరచబడిన దానిని వృద్ధిచేయడం, (రక్షిత వివర్ధనం)

4 అలా వృద్ధిచేయబడిన దాన్ని తగినవారికి— అర్హులకు—పంచిపెట్టడం (వృద్ధస్య తీర్థేషు ప్రతిపాదనం)

కౌటిల్యుడే కాదు యిలాంటి నిర్వచనం చేసింది, మనువుకూడా తన స్మృతిశాస్త్రంలో పై విధంగానే చెప్పాడు భూభాగాన్ని (దండం) సైన్యం సహాయంతో సంపాదించాలని చెప్పాడు భూభాగం (సంపాదన) తో సంబంధించినదే దండనీతి లేక అర్థశాస్త్రం అని మనువు నిర్వచనం

## రాజ్య దృక్పథం : దాని లక్షణాలు

ప్రాచీన హైందవ అర్థశాస్త్రజ్ఞులు రాజ్యానికి ఏడు లక్షణాలు, లేక ప్రకృతులు వుంటాయని చెప్పారు పాశ్చాత్య రాజనీతి శాస్త్రజ్ఞులు, రాజ్యానికి నాలుగు లక్షణాలుంటాయని చెప్పారు—1 జనులు 2 భూభాగం 3 ప్రభుత్వం 4 సార్వభౌమాధికారం ఈ నాల్గవ లక్షణాన్ని బహిరత అంతరిత సార్వభౌమాధికారాలని రెండుగ విభజించారు

మన శాస్త్రజ్ఞులు రాజ్యానికి ఏడు ప్రకృతులుంటాయని చెప్పారు ప్రకృతులంటే రాజ్యంయొక్క సహజభాగాలనీ, సహజమైన అంగాలనీ అర్థం చేసుకోవాలి. రాజ్యంఅంటే రాజుపాలించే ప్రత్యేక భూభాగాన్ని సూచించదు రాజు పాలించే భూభాగమే "రాజ్యం" ఐతే, ఆ రాజ్యాన్ని (State) మన్ను ఏడు ప్రకృతులలో "రాజు" ఒక లింగంగా ఎందుకు పరిగణింపబడాలి? రాజు పాలించే భూభాగమే రాజ్యం ఐతే, ఆ భూభాగానికి "జనపదము" అనే పేరుపెట్టి దానిని ఒక స్వతంత్ర ప్రకృతిగా ఎందుకు మన రాజనీతిశాస్త్రవేత్తలు పరిగణించారు? కాబట్టి రాజు పాలించు భూభాగం రాజ్యంకాదు ఆ భూభాగానికి జనపదము అనే పేరు ప్రత్యేకంగావుంది రాజ్యం అంటే ప్రభుత్వంకూడా కాదు రాజ్యమునకు సంబంధించిన వివిధ కార్యకలాపాలను ఆచరణలో పెట్టు యంత్రము లేక కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వం పోతే దుర్గం (Fort) కోశం (Treasury) యీ రెండూకూడా రాజ్యంయొక్క ప్రకృతులవియే మన వారి దృక్పథం కాబట్టి ప్రభుత్వంగానీ, రాజు పాలించే ప్రత్యేక భూభాగంగానీ రాజ్యంకాదు స్వామి, అమాత్యులు, జనపదం, దుర్గం, కోశం, దండం, మిత్రం—యీ యేడు అంగాలూ కలిస్తే రాజ్యం ఔతుంది అని మన శాస్త్రజ్ఞుల దృక్పథం

కౌటిల్యుడు తన "అర్థశాస్త్రం"లోనూ కామందకుడు "నీతిసారం" లోనూ, యీ యేడు ప్రకృతులనూ అతివిస్తరంగా వివరించారు. ప్రస్తుతం పై ఏడు ప్రకృతులనుగూర్చి కౌటిల్యుడు చెప్పినది పరిశీలిద్దాం

1 స్వామి స్వామి (రాజు) రాజ్యంయొక్క అత్యంత ప్రధానమైన లక్షణం లేక భాగమని కౌటిల్యుడంటాడు. స్వామి అంటే రాజు లేక సార్వభౌమాధికారి. ఈ సార్వభౌమాధికారం ఒకనియందుగానీ లేక పెక్కుమందిలోగానీ వుండవచ్చును ఈ స్వామికి ప్రధానంగా వుండవలసిన లక్షణాలు ఇవి

ప్రజల్ని ఆకర్షించి వారిని తన శాసనాన్ని అనుసరించునట్లు చేసుకోగలగాలి (అభిగామిక స్వభావం)

1 ప్రజల్ని అర్థంచేసుకోగలగాలి (ప్రజ్ఞ)

2. కీర్తివంతుడై వుండాలి (ఉత్సాహ)

3 ఆత్మసంపద కలిగినవాడై వుండాలి (ఆత్మ సంపద)

4 శక్తిసామంతుడై వుండాలి (తనచుట్టూవుండే వ్యక్తులను అదుపులో పెట్టగలిగినవాడై వుండాలి)

5. క్షుద్రులుగాని మంత్రి మండలిని కలిగివుండాలి

6 యుద్ధంచేయుడానికీ సంధిచేసికోవడానికీ తగిన సందర్భాన్ని గుర్తించగలిగిన చాకచక్యం వుండాలి.

పైనచెప్పిన లక్షణాలను నిశితంగా పరిశీలిస్తే, స్వామిఅంటే సామంతరాజుగాదనీ, అంతర్గత బహిర్గత సార్వభౌమాధికారాల్ని చలాయిస్తూ ఏ విదేశీరాజ్యాధికారానికీ లొంగని సార్వభౌమాధికారి అని బోధపడుతుంది

2. అమాత్యులు — సాధారణంగా అమాత్యుడంటే రాజమంత్రి అని అర్థం కాని కౌటిలీయంలోని మొదటి అధ్యాయాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, అమాత్య పదానికి అర్థం, రాజమంత్రి కాదనీ, ఏదైనా ఉన్నతోద్యోగాధికారి ఐనా కావచ్చునని స్పష్టంగా బోధపడుతుంది అమాత్యుడు జనపదానికి చెందినవాడై వుండాలనీ, రాజ్యంపై అధికతర భక్తిశ్రద్ధలను కలిగివుండాలని చెప్పాడు.

3 జనపదం:—జనపదాన్ని జనం—పదము అని రెండుభాగాలుగా విభజించాలి. దీనికి సామాన్యార్థం, పల్లెపట్టులేక గ్రామము కాని అర్థశాస్త్ర పరిభాషలో దీనికొక ప్రత్యేకమైన అర్థంవుంది. పాశ్చాత్యరాజనీతి శాస్త్రంలో జనులు, భూభాగంఅనే రెండు స్టేట్ యొక్క

రెండూ లక్షణాలు. కాని మన అర్థశాస్త్రజ్ఞులు ఈ రెండింటిని ఒకే పదంలో ఇమిడ్చి జనపదం అనే పేరును వ్యాఖ్యలోకి తెచ్చారు. జనపదాన్ని కౌటిల్యుడు అత్యంత ప్రతిభావంతంగా నిర్వచించాడు. మొదట "పదము" అనే భాగాన్ని (భూభాగం) నిర్వచించి దానికి ఉండవలసిన ప్రధానలక్షణాలు వివరించాడు. పిదప "జన" అనుదాన్ని నిర్వచించి ఒక ప్రత్యేక భూభాగమందలి జనులకుండవలసిన లక్షణాలు వివరించాడు. భూభాగమున్నచోటనే జనులు నివసిస్తారు, జనులు భూభాగమందే నివసిస్తారు కనుక ఈ రెంటిని (జన-పద) ఒకటిగానే పరిగణించి, 'జనపదం' అను పేరును వ్యాఖ్యలోకి తెచ్చాడు. ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రవేత్తల ప్రతిభ కిది తార్కాణం. పాశ్చాత్యుల దృష్టిలో భూభాగము జనులూ వేర్వేరు లక్షణాలతో ఉన్నాయి. ఇది యాంత్రిక దృక్పథం. కారణం? జనులు భూభాగమున్న చోటనే నివాస యోగ్యమగు ప్రదేశాలు సృష్టించుకొనగలరు. రమ్య ప్రాంతాలు పర్వత ప్రదేశాలు, పెనుపులులవంటి మృగాలుంటే క్రూర జంతువులు లేని ప్రదేశం ఉత్తమ జనపదమని కౌటిల్యుడన్నాడు. సస్యశ్యామలమై ఫలవంతమైన ఉత్తమ క్షేత్రములూ, ఏనుగుల వనాలతో నిండిన అరణ్యాలు జనపదంలో ఉండాలి. ఇవన్నీ భూభాగం లక్షణాలను గూర్చి చర్చ.

ఇక జనులను గూర్చి ఏం చెప్పాడో పరిశీలిద్దాం. జనులు శత్రు ద్వేషం కలవారై వుండాలని, శక్య సామంతులై వుండాలని అంటాడు. అంతేగాక, కర్మశీలురైన కర్షకులతో నిండి వుండాలి. జనులు రాజు యెడల భక్తి ప్రపత్తులతో మెలగుతూ శుచిగా వుండాలి. 1 శత్రుద్వేషం 2 శక్య సామంతత 3 కర్మశీలకర్షక 4 భక్తి సచ్ఛీలం—యీ నాలుగు లక్షణాలు గలిగిన వారై వుండాలి.

1 ప్రజలు శత్రువులను ద్వేషించువారై జీతభుక్తులై రాజ్య స్వాతంత్ర్యాన్ని పరిరక్షించ నిరంతర దీక్షా కంకణులై వుండాలి.

2 పరిసర రాజ్యాలను యుద్ధరంగమందు ఎదిర్చ శక్తిసామర్థ్యాలు గలవారై వుండాలి.

3 రాత్రింబవళ్ళు కష్టించి భూమిని దున్ని దేశాన్ని భాగ్యవంతం చేయగలిగిన కర్మశీలతగలిగిన కర్షకులతో నిండి వుండాలి.

4 రాజ్యం (state) యెడల భక్తి ప్రకటిస్తూ శుచికల హృదయాలు కలిగివుండాలి. (భక్తి శుచి సమస్యం.)

4 దుర్గం రాజ్యమందలి నాలుగు దిక్కులలోను యుద్ధావసరాలకొరకు శత్రు నిగ్రహంకొరకూ దుర్గాలు నిర్మించాలి. ఏ రాజు ప్రకృతి సిద్ధమైన దుర్గాన్ని నిర్మింపడో అతడు శత్రురాజులకు సునాయాసంగా నిర్జింపబడగలడు. జలదుర్గం గిరిదుర్గం ఎడారిదుర్గం అటవీదుర్గం వంటి నాలుగురకాల దుర్గాలనునిర్మించాలని కౌటిల్యుడు చెప్పాడు.

5 కోశం రాజ్యకోశం వెండి బంగారాలతో నిండి ఉండాలి. బంగారు వెండి నాణాలతోనూ, వజ్ర వైడూర్య మరకత గోమేధిక పుష్యరాగాది అమూల్య రత్న సందోహంతోను కోశాగారం నిరంతరం ఘలు ఘలు మంటూవుండాలి. ఈవిధంగా వుండినప్పుడే విపరీత విపత్కర పరిస్థితులనుండి రాజ్యం రక్షింపబడుతుంది. ఈ అమూల్య సంపదనంతటినీ రాజుగాని అతని తండ్రి తాతలుగానీ ధర్మబద్ధమైన మార్గాల ద్వారా సంపాదించాలంటాడు. రాజ్య సంరక్షణ, సామ్రాజ్య విస్తరణ, కరువుకాటకాల నివారణ, అంతఃకలహ పరిహారణ, వర్తక వాణిజ్యాల అభివృద్ధి వంటి సర్వకార్యనిర్వహణలు, రాజ్యకోశంమీదనే ప్రధానంగా ఆధారపడి వుంటాయంటాడు. కాబట్టే కోశవృద్ధికి రాజులు నిరంతర జాగరూకులై వుండాలని చెప్పాడు. "ధనమూల మిదమ్ జగత్" అనే పరమ సత్యాన్ని గ్రహించాడు కౌటిల్యుడు. ప్రభుత్వ యాజమాన్యాన పారిశ్రామిక శాఖలను (ప్రచార సమృద్ధి) నడిపినప్పుడు, సస్యసంపద సమృద్ధిగా వున్నప్పుడు, వర్తక వాణిజ్యాలు ఉచ్ఛదశలో వున్నప్పుడు, రాజ్యకోశం గనక కనక వస్తు వాహనాలతో సమృద్ధిగా ఉండినప్పుడు మాత్రమే శత్రువులదాడిని రాజు ఎదుర్కొని జయింపగలడు. వర్తకాభివృద్ధి పై కోశం, కోశాభివృద్ధిపై రాజ్య సుస్థిరతను కాపాడు సైన్యం, ఆధారపడి వుంటాయని చెప్పాడు.

కోశం ఖాళీగావున్నప్పుడు శత్రుదండయాత్ర జరిగితే అసత్యమార్గాలద్వారానైనా రాజు ద్రవ్యాన్ని సేకరించాలి. విపత్కరసమయాలలో ధర్మం కార్యాచరణకు అడ్డురాకూడదంటాడు. అందుకే కౌటిల్యుడు ధర్మశాస్త్ర నిబంధనల సంకెళ్ళనుండి అర్థశాస్త్ర సిద్ధాంతలను వేరుచేయగలిగి, ఆ శాస్త్రాన్ని సర్వసమగ్రమగు స్వతంత్ర శాస్త్రంగా సృష్టించగలిగాడు.

ఫలవంతాలైన భూములపై అధికంగా పన్ను విధించడం, సంపన్నులైన వణిక్ ప్రముఖులు అమ్మే వస్తువులపై విపరీతంగా ప్రభుత్వ సుంకాన్ని వసూలు చేయడం, రాజు పేరట యజ్ఞాల వసూలుచేయడం, (Forced loans and Benevolences) ప్రజల మూఢవిశ్వాసాలను, మతనమ్మకాలను, ఆసరాగా తీసి

కాల్లోని ప్రభుత్వోద్యోగులు తమతమ పనులు సక్రమంగా నిర్వహిస్తున్నారో లేదో పరిశీలించాలి తాము తెలిసికొన్న విషయాలు రాజుకు విన్నవించడం ఇంటివి వీరి కార్యాలు. రాజు మంత్రి పరిషత్తును అత్యవసర సమయాలలో నే సమావేశపరిచి వారితో సంప్రదించాలి వారిలో ఎక్కువమంది ఏది కార్యసిద్ధి దాయకమని సూచిస్తారో దాన్నే రాజు ఆదరించాలి మంత్రులలో ముఖ్యుడు ప్రధానామాత్యుడు ఇతడు రాజుకు కుడిభుజం రాజ్యపాలనలో రాజు తర్వాత రాజంతటివాడు రాజ్యాన్ని అపహరించ గలంతటి అవకాశం అతనికుండేది ప్రాచీన హిందూ రాజ్యానికి యుద్ధమూ, అంతరంగ విప్లవమూ, మహా అపాయకరమైనవి. యుద్ధంవస్తే రాజు వునికికే భంగం వాటిల్లుతుంది అందుచేత, యుద్ధం, అంతర్గత విప్లవంలాంటి విపరీత విపత్కర పరిస్థితులలో రాజు తానుచేసిన దోషాలే వయినా వుంటే ఒప్పుకొని ప్రధానమంత్రిని శాంతింప చేయాలి. కాకపోతే పదవిచ్యుతి ఖాయం. నాటి రాజరిక వ్యవస్థలో ప్రధానామాత్య పదవి ప్రాముఖ్యాన్ని శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు యిలా వివరించారు— "అమాత్యపదవి యింతటి గౌరవముతో అధికారముతో ను, కూడుకొనిన దగుటచేత నే, ప్రభువునుండి యితనిని వేరుపరచినయెడల తమకు తప్పక జయము లభించునని శత్రువులు నమ్ముచుండువారు రాజ్యమందలి గూఢచారు లందరిపై అమాత్యునికి నిరంకుశాధికార ముండెడిది" అందుకే కౌటిల్యుడు పురోహితుడు, ప్రధానమంత్రి ఎంతటి మహాపరాధాన్ని చేసినా, వారికి మరణదండన విధించరాదని చెప్పాడు

## రాజకార్య నిర్వహణ

కౌటిల్యుని కాలంలో రాజకార్య నిర్వాహకులు మూడుభాగాలుగా విభజింప బడ్డారు రాజు సముఖముందుండి రాజ్యమంతటిపై కార్య నిర్వహణాధికారం వహించే కేంద్ర కార్య నిర్వాహకోద్యోగులు కొందరు వారి పేర్లివి—1 మంత్రి, 2 పురోహితుడు, 3. సేనాపతి, 4 యువరాజు, 5 దౌవారికుడు, 6 అంతర్వంశికుడు, 7 ప్రశాస్త్రి, 8 సమాహర్త, 9 సన్నిధాత, 10 ప్రదేష్ట, 11 నాయకుడు, 12. పౌరవ్యావహారికుడు, 13 కార్మాంతికుడు, 14. మంత్రి పరిషదధ్యక్షుడు, 15 దండపాలుడు, 16 దుర్గపాలుడు, 17 అంతపాలుడు, 18 ఆటవికుడు. ఈ 18 మంది ఉద్యోగులకు 18 తీర్థాలని పేరు ప్రధానకార్యాన్ని దేనైనా ప్రారంభించాలంటే ధనం లేకపోతే అడుగు ముందుకుపడదు. అందుచేత ధన సేకరణలో, కూడుకొన్న సమాహర్త ఉద్యోగం అధికతర బాధ్యతతో కూడుకొన్నది రాజ్యానికి ఆదాయాన్నిచ్చే ప్రధాన అంగాలు—దుర్గ, రాష్ట్ర, ఖని, సేతు వనం, వ్రజ, వణిక్పథాలు. వీటిని మంచిస్థితిలో ఉంచి బాగా వృద్ధిచేయాలి విపత్తులేవి రాకుండా కాస్తే, వారించేందుకే కోశాన్ని పుష్కలంగా నింపుతూండడం సమాహర్త విధి ఈ ఏడు రకాలైన ఆదాయాల్ని వసూలుచేయడానికి ఐదు లేక పది గ్రామాలపై గోపుని నియమించాలి ఇతడు గ్రామంలోని సాగు భూముల్ని, బంజరు భూముల్ని, సర్వే చేయించి వాటికి సంబంధించిన దాన విక్రయాదుల్ని, రిజిష్టర్ చేయడం, నాలుగువర్ణాలకు చెందిన ప్రజల జననమరణ లెక్కలను వ్రాయడం చేయాలి గోపునిపై స్థానికుడనే మండలాధికారి, అతనిపై ప్రదేష్ట అనే రాష్ట్రాధికారి, నియమింపబడేవారు వీరందరి సహాయంతో సమాహర్త అప్రమత్తుడై జనపదాన్ని పరిశీలిస్తూ వివరసేకరణకు గూఢచారులను, జనపదమంతా తిప్పుతూ విషయాలను గ్రహించేవాడు యుద్ధం, దుర్భిక్షం యిత్యాది ఉపద్రవాలవల్ల కోశం ఖాళీవితే, దేవుని ఉత్సవాలు, మతకార్యకలాపాల వంటి సత్కార్యాల కోసం ధనం కావాలని మిషపెట్టి పౌరుల్ని యాచించాలి మొదట కొంతమంది ధనవంతుల్ని ప్రోత్సహించి అధిక మొత్తాన్ని రాబట్టాలి. ఈ మొత్తాలు చూచి, పౌరజానపదులు తమ తమ ముడుపుల్ని ముట్టచెప్పేట్లు చేయాలి యాచింపబడకుండా తమంతట తామే రాజుకు డబ్బు యిచ్చే వారికి, వారివారి మొత్తాలను దృష్టిలో పెట్టుకొని స్థాన, ఛత్ర, వేష్టన, విభూషణాలవంటి బిరుదులు యివ్వాలి. కోశం ఖాళీగా వుంటే దేవ ద్రవ్యాన్ని, ప్రేతద్రవ్యాన్నీ కూడా సంగ్రహించవచ్చునని కౌటిల్యుడు ఖండితంగా చెప్పాడు సంకట సమయాల్లో మతవిశ్వాసాలు, మూఢాచారాలు, ప్రచారంచేసి మోసంచేసి ఐనా, బెదిరించైనా, ప్రజలనుండి ధనాన్ని రాబట్టాలి, అని ఖండితంగా, నిర్భీతిగా చెప్పాడు కౌటిల్యుడు తన శాస్త్రంలో ప్రతిపాదించిన సూత్రాలకు, కేవల ధర్మ సూత్రాలకు సమన్వయం కుదరదని వేరే చెప్పనక్కరలేదు లక్ష్యం ఎంత పవిత్రమైనదో, దాన్ని సాధించేందుకు అవలంబించే మార్గాలు కూడా అంత పరిశుద్ధంగా వుండాలని-చాలా మంది చెప్పవచ్చు ఐతే దురదృష్టవశాత్తూ కౌటిలీయంలో ధర్మానికి, మంచిచెడ్డలకి తావులేదు అతడు సూచించిన కూటయుద్ధాలు భేదోపాయాలు, హింసాకృత్యాలు, మోసం, కుటిలత్వం, ధర్మశాస్త్ర వేత్తలకి, నీతిశాస్త్ర పారంగతులకి నచ్చకపోవచ్చు అదర్శానికి ఆచరణకి ఎంతో దూరంవుందని గుర్తించిన కౌటిల్యుడు సర్వకుటిల

# కౌటిల్యుని అర్థశాస్త్రము

తంత్రాలను ఎత్తుగడలను దైనందిన రాజ్యవ్యవహారాలలో మొలబంటి లోతుదాకా మునిగిన పరిపాలకుడు తప్పక అనుసరించ వలసిందేనని చెప్పాడు. ఐతే ఈ దృక్పథం రామాయణ కాలంనాటికే బీజప్రాయంలో వుంది దానిని విపులంగా వివరించినవాడు కౌటిల్యుడు ఆదికవి వాల్మీకి రామాయణంలో ఈ విధంగా చెప్పాడు—

"నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్
రాజ్యభార నియుక్తానా మేష ధర్మస్సనాతనః

రాజ్యభారం వహించే వాళ్లకు ప్రజారక్షణమే ప్రధానం క్రూరమైనా, క్రూరం గాకపోయినా, ప్రజారక్షణకొరకు రాజు చేసే ప్రతి పనీ, ధర్మ కార్యమే—అని ఆదికవి వాల్మీకి చెప్పాడు

ఇంగ్లండును పాలించిన ట్యూడరు వంశరాజు ఏడవ హెన్రీ, తన మంత్రులైన ఎంప్సన్, డడ్లీ, మార్టన్ల, సహాయంతో, ఆంగ్లప్రజలనుండి వైవిధ్యంగానే డబ్బు గుంజాడు ఒకవ్యక్తి [illegible] జీవిస్తే, నీవు తప్పకుండా భాగ్యవంతుడవై వుండాలి గాబట్టి డబ్బు యివ్వమని బలవంతం చేసేవాడు ఎవరైనా పేదరికంగా జీవిస్తే ఎంతో ధనం నిలవచేసి వుండి వుండాలి గాబట్టి అతడి వద్ద, గుంజేవాడు

మహాభారతంకూడా [illegible] ద్వారా డబ్బు గుంజమని సలహా యిచ్చినా కౌటిల్యునివలె నగ్నంగా ప్రజలనుండి ధనాన్ని పిండమనిమాత్రం చెప్పలేదు

నిద్రపోయే మనిషిని యెలుక పట్టుకొని కొరుకుతూ ఊదితే ఆబాధ, అతడికి మర్నాడు మేలుకొన వొచ్చిన తర్వాతగాని తెలియనట్లు రాజ్యాంగయంత్రం చేసే దొంగ దోపిడి అతిసున్నితంగా అంత [illegible] వుండాలని భారతం చెప్పింది కౌటిల్యుడు యిలాంటి చాటు మాటు దోపిడీ గాక, బహిరంగంగానే దోపిడీ చేయమన్నాడు కౌటిల్యుని దేశద్రవ్యానికి రక్షణ లేకపోతే, మనుష్యులప్రద్రవ్యాలకు ఎక్కడిరక్షణ?

రాజ్యంలో జనపదం, నగరం అనే రెండుభాగాలుంటాయి గ్రామాల సముదాయం జనపదం పట్టణాలతో కూడింది నగరం పరిపాలనా సౌకర్యంకోసం జనపదాన్ని నాలుగుభాగాలుగా విభజించాలి. కొన్ని గ్రామాలు పన్ను చెల్లించనవసరంలేనివి, కొన్ని పన్నులకు బదులు ప్రభుత్వానికి కావలసిన కూలిపని చేసేవి కొన్ని గ్రామాలు ఆయుధీయాలు గ్రామ పాలనం గ్రామికుని లేక గ్రామస్వామి లేక గ్రామ వృద్ధుల అధీనంలోవుండాలి. గ్రామంలోని వివాదాలను పరిష్కరించేందుకు గ్రామవృద్ధులతో గ్రామపరిషత్తు (పంచాయతీబోర్డు)ఏర్పడాలి పదిగ్రామాలకు ముఖ్యంగా "సంగ్రహణాన్ని", రెండువందల గ్రామాలకి ముఖ్యంగా "ద్రోణముఖాన్ని", ఎనిమిదివందల గ్రామాల నడుమ 'స్థానీయాన్ని' (రాష్ట్రనగరం) నిర్మించాలి. ప్రతి గ్రామంలోను, ఋత్విక్కు, పురోహితుడు, శ్రోత్రియులు మొదలయినవారివుంటే, వారికి మడిమాన్యాలు ఇవ్వాలి అన్ని ఆపదలనుండీ రాజు జనపదాన్ని రక్షించాలి

ఒక్కొక్కశాఖకు ఒక్కొక్క అధ్యక్షుడు నియమింప బడేవాడు పణ్యాధ్యక్షుడు, కూపాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు, గణికాధ్యక్షుడు, నావాధ్యక్షుడు, అశ్వాధ్యక్షుడు, హస్త్యధ్యక్షుడు, రథాధ్యక్షుడు, పత్త్యధ్యక్షుడు, ముద్రాధ్యక్షుడు, వివీతాధ్యక్షుడు, మానాధ్యక్షుడు మొదలగు అధ్యక్షులు వివిధశాఖలకు నియమింపబడి రాజ్యనిర్వహణలో పాల్గొనేవారు ఈ విధంగా రాజధానినుండి గ్రామసీమదాకా కోటి కొట్ల కొంకులతో దృఢతర అధికారం రాజ్యమంతటి నలుదిక్కులకు కేంద్రీకృతమవంగా ప్రసరించేది

సామ్రాజ్య నిర్వహణలో పాల్గొనే రాజోద్యోగుల లంచగొండితనాన్ని గూర్చి కూడా కౌటిల్యుడు వివరించాడు రాజోద్యోగులు తమ ఆదాయాన్ని వృద్ధిపరచుకోవాలంటే నానా జనపదాలను విపరీతంగా పీడిస్తారని, అలా అపహరించినదాన్ని తిరిగి కక్కేట్టుచేసి వారిని మరో వుద్యోగంలోకి మార్చాలని కౌటిల్యుడు చెప్పాడు "నాలుకచివర వుంచిన విషాన్నిగాని, తేనెనుగానీ ఆస్వాదించకుండా విడువనట్లు, అర్థాధికారికి రాజద్రవ్యాన్ని కొంచెమైనా దొంగిలించకుండుట కష్టం నీటిలోవుండే చేపలు ఎవరికీ తెలియకుండానే నీరు తాగునట్లు కార్యనిర్వహణలో నియమింపబడే వుద్యోగులు ఎవరికీ తెలియకుండానే డబ్బును దొంగిలిస్తారు." అని అంటాడు ఆకాశాన ఎగిరేటి పక్షులగమనాన్నైనా తెలుసుకో వచ్చునుగాని, ప్రచ్ఛన్న భావులై సంచరించు రాజోద్యోగుల ప్రవర్తన తెలిసికొనడం కష్టతరం సమాహర్త (Collector - general of Taxes) వంటి వుద్యోగాలు చేసేవారిని రాజు నిరంతర జాగరూకతతో పరీక్షిస్తూ వుండాలని కౌటిల్యుడు చెప్పాడు ఉద్యోగులకు పెద్దపెద్ద జీతాలిస్తే లంచాలు పుచ్చుకోక, రాజకార్య నిర్వహణలో నిమగ్నులౌతారని ఆయన అన్నాడు.

కౌటిల్యుడు పండితుడు మాత్రమే కాడు. అసాధారణమైన లౌకిక వ్యవహారానుభవం కలవాడు సువిశాలమైన మౌర్య సామ్రాజ్యాన్ని పరిపాలించేం

## కౌటిల్యుని అర్థశాస్త్రము

కౌటిల్యుని తర్వాత అర్థశాస్త్రం ఏ విధముగ అభ్యుదయాన్ని సాధించలేకపోయింది. క్రీ॥ శ॥ 4వ శతాబ్దంలో కామందకుడు రచించిన "నీతిసారం", 10వ శతాబ్దంలో సోమదేవసూరి రచించిన "నీతివాక్యామృతం" మినహా, మిగతా గ్రంథాలన్నీ అతుకుల బొంతలు, అనుకరణలూను. పిదప, రచింపబడినవన్నీ, ప్రాచీన శాస్త్రాల ప్రతిపదికలోనో, ఇంకో సంక్షిప్తంగానో వ్రాయబడ్డ అర్థశాస్త్ర సంకలనాలు. ఇవి కొల్లలుగా పుట్టాయి. తత్ఫలితంగా అర్థశాస్త్రాన్ని గూర్చిన అధ్యయనం క్రమేపీ క్షీణించి పోయింది. ప్రాచీన భారతంలో ఉద్దండులైన పండిత ప్రకాండులచే, మహామహులైన శాస్త్రవేత్తలచే పెంచి పోషించబడి నూరు పూలూ, వేయి కాయలు కాచిన హైందవార్థశాస్త్రం, తదధ్యయనం క్రమంగా క్షీణించి పోయింది. కౌటిల్యాచార్యుల తేజస్సుతో వర్ధిల్లి ప్రకాశించిన ప్రాచీన అర్థశాస్త్రం కౌటిలీయాన్నే అశేషంగా వదిలిపోయింది.

మనకీ ఒక అర్థశాస్త్రం వుంది. దానికి వేలసంవత్సరాల చరిత్ర వుంది. ఆ దీర్ఘచరిత్రలో కౌటిలీయార్థశాస్త్రం ఒక మహోజ్జ్వల గ్రంథం. మన ప్రాచీన శాస్త్రాన్నీ, దాని చరిత్రనీ కవిలికట్టల్లోనుండి, హస్తభాండాగారాలలో దిక్కూ మొక్కూ లేక పడివున్న వివిధ తాళపత్ర గ్రంథ సందోహమునుండి తవ్వి తలకెత్తాలి. ఎన్నో అర్థశాస్త్ర గ్రంథాలలో పేర్కొనబడ్డ వివిధ శాస్త్రగ్రంథాలు మనకు నేడు ఎక్కడా కనిపించడం లేదు. వాటన్నిటినీ తిరిగి పరిశోధించి, వెలికి తీయాలి. ఆనాడే మనం ప్రాచీన హైందవుల అర్థశాస్త్రాన్నీ, దాని చరిత్రను సర్వసమగ్రంగా, సర్వాంగసుందరంగా కాంతిలోకి తెచ్చి ప్రపంచం ముందు పెట్టగలం.

# సింతసివురు

'నోరు తిన్నగా రాని పిచ్చోడా! నీవలాంటి వాళ్ళని గాదు! నేరుస్తున్నాను, లేక నీల్గుతుండవు. ఊరికే కవిత్వం గుప్తిస్తున్నావు!'

'నా నోటికొగ్గిన పాట పాడతాను! నీకేం?' అని వడిలో కూర తీసుకొని నవ్వేల్తూ, 'దానికేంగాని, సురవన్న మామ కన్నాదిలి యేపకు పోయినోడు! నువ్వెన్నాళ్ళిట్టా వుంటం' అని అగి, వాగులు కళ్ళలోకి ప్రశ్నార్థకంగా చూశాడు వాగులుకే మాటలు దుర్గా అంటాయి.

'ఏమో నాకేటి తెలుసు' అని గట్టు దిగి పొలాల కడ్డంబడి నడక సాగింది

'నిన్న ఫ్రుత్తే పెళ్ళాడిన సురవన్న మామ, సంసారం చేస్తా సే, ఓ రోజా మాయమైపోయాడు అంతు చిక్కని దూరాలకి!'

పిచ్చోడు వాగులు దారికేసి చూస్తూ గొర్రెల్ని తోకల్ని మళ్ళించుకొంటున్నాడు

పాతిగాయం రేగినట్టుంది మెరపు కావురు మంటోంది—ముక్కు పెంగానికి వగలూ బాదాలూ లేవు అన్నీ మునలయ్య గోగాల్లో కరిగిపోయాయి సురవన్న జాడ తెలియదు చేటివరకూ .

'ఎంతకాలం మగపురుగున్నమ్మగోమంటావు! ఆడికోసం ఎన్నాళ్ళని ఎదురుచూడ్డం పింత పెటు కావున్నంతకాలం నీకు చింత లేదు' అంటోంది మనసు

కుమ్మతో పుడకొంచి, పిస్తోన్న ఈదరగాలి, వణ్ణించబోయే మబ్బుల తోందరా..

వయ్యారంగా కనుపడ్డాగా ఉయ్యాల లాగుతూన్న అడుగుల్ని దాటుకొంటూ వడిలో కూర మప్పిరింగా పట్టుకొని, రైలు గేటు దాటింది

'ఎంతకన్నా తగ్గావో కే! ముత్రాలమ్మకొడుకు యిపిరి యిపిరి ఎంత మాటన్నాడు మాగు మనువు సేసుకోమని, మనసు మార్చుకోమని మా యిద్దరు ఘూడంలో వోట్టి—సురవన్న మామకోసం ఎదురుచూసి, ఎదురుచూసి సేనాళ్ళన్నాయిత్తెగాని, మనువు సేసుకోమ మొగోణ్ణి నమ్ముకు పెడమన్న దేవరు! మరొకడైతే అనురుగా అనితే పాలు తిన్నాదిలి పారిపోతాడు మనువు సేసుకొన్నాకోడు మాయలోడైతే బతుకు మరేంగాను"

కావలమ్మ గుడిదగ్గరికొచ్చింది. గుడిలో అమ్మ వారికి వంగి వంగి దండంపెట్టింది 'సురవన్న మామని దూరం చెయ్యకు తల్లీ!' అని

తల్లి, 'నీ మొరాలించాలే' అన్నట్టు చూసింది దయామయంగా గుడికెగుడుగా గంగరావిచెట్టు కింద ఒకక్షణం కూర్చొని, లేచి, దగ్గు వదుదుకొంటూ నీధిరిపడింది

'అమ్మా! చింతకూర' అని ఆగింది సుమ్మం ముందు ఇంటావిడ 'అత్తే' బాగుగా తక్కువ పెడుతున్నావు! కొనాలా పెటాలా? ఊరికే వచ్చిందిగదూ? మరింత పెడితే నీసామ్మ్యం పోయిందా?' అంటోంది—చేట తెచ్చి చిమ్మం పోసి కూర పెట్టించుకొంటూ.

ఇంట్లో వాళ్ళతో గొణుక్కుంటున్నారు

'అత్తే వాళ్ళకి పెళ్ళి పెదాకులూ ఏంటీ? పట్టి పశువులు'

ఇంటావిడ పగలబడి నవ్వుకొంది

వాగులు చెవుల్ని కోయకున్నయ్ వాళ్ళ మాటలు

నీతికి, నిజాయితీకి తర్సేం తక్కువకాదు

త్వరగా, కూర పూర్తిచేసి సంత చేసుకొని, గుడిపెకి మళ్ళింది

ఆకాశం మబ్బుపట్టి మరింత చీకటి పెంపొందుతోంది చిన్న చిన్న తుప్పరపడి, వాగులు వంటిమీదబట్టలు తడిసి, ముడుచుకుపోతున్నాయి ఎదురుగాలి ముఖాన్ని మొత్తుతోంది దలనిగాలికి ముడుచుకొన్న పెదవులు వణుకుతున్నాయి ఎదురొస్తోన్న పసువుల్ని, పసుల కాపరుల్ని తప్పుకొంటూ, పల్లె గుడిదగ్గరికొచ్చేసరికి ముసురు మరింతగా విసురుతోంది ఐనా, గేటుదాటి రైలుపట్టాలవెంట నడిచి, అలోచనలు ముళ్ళు విప్పుకొంటూ గూడు చేరేసరికి, గుడ్డిదీపం వెలిగించమని ముందుకొస్తోంది.

ఉక్కెనులకమండంమీద మునలయ్య ఖల్లుఖల్లున దగుతూ, 'ఏటే వాగూ! గిరపాన్నేంటి దీపకేం ఎలిగిత్తావు! సంతిసేసుకొచ్చావాగా?' అన్నాడు.

'అఁ' అంది

'ఏపన్నా తెచ్చుకున్నావా? కాసిస్తే మన ఏదుపు కొంత తీర్తది'

# భాగ్యనగర కోకిల

శ్రీ నాయని సుబ్బారావు

1

పదిగళము లొక్క గళమై
విదిలించినగతి సుపుష్ప విస్పష్టరవా
భ్యుదయ మనోహరగానా
స్పదమూర్తివి శ్యామల ప్రభారమ్యతనూ!

నీ వినదప్రభావమహా
    నీయరసోన్నమితమ్మయిన మూ
నీనది తట్టిలేప విక
    సించిన గంధమ్ము ప్రభాసితో
ద్యానవనీ బలాలికయు
    దర్పితు డతడు పేర్చు చైత్రయా
త్రానిరతిన్ వసంతు డను
    త్ప్రమదోదయ దిగ్దిగంతుడై

అవ్యవన్యస్థలమ్ముల నచిరకాల
మున వసంతుడు తానొక్క మునలివాడు,
త్వద్దయాపోషిత ప్రాణధనుడు వాడు
నిత్యనూతన యౌవనాన్వితు డచట

నీమాయ మెట్టిదో నీ
శ్రీ మధురకలస్వనమున చిగిరించినవా
రై మరులు కొంద్రు రతియును
కాముండు వసంతమూపకలనాగరిమన్.

2

సుర్వాపై షేర్వాణీ -
పర్చి చిబుకజానుయుగళ పర్యంతము, కిం
కుర్వాణ ధారితక చి
త్తార్వాయిత కింకిరాటు లచ్చటి తరుణుల్.

అరుదగు సికిలరవమున
కరంగుదురే చార్మినార్ సిగారెట్ దమ్ముల్
జరదా వేసిన బీడా
పరమార్థమువారి కింకపనివల దేమిన్

షెల్వార్ కుర్తా వోణీ
చెల్వమ్ముల విశ్వవిజయశీలి మరుని చే
తల్వార్లు క్రొత్త బాదమ్
హల్వా రుచిం గాదను రతు లచ్చటితరుణుల్

అథవు సెగకంటి మంటల నార్పజాలు
చలువకాటుక కడ్డి పసందు లోలయు
రెండు జడల రతిదేవు లుండబట్టి
బ్రదికి రంగసంయుక్తులై భావభవులు

3

వారు సంస్కార శుచులైన భాగ్యవంతు
లొక్కడాడ్జీ మహారథ మెక్కివచ్చి
చెఱువుకట్ట బెంచీపైన చెరియొకదెస
కొలువుదీర్తురు చేతిగుచ్ఛలను పఱచి

పకగా వేకసినగ పప్పించికొని య
లంకు నగపాలు మోహంపు తరుణి కిచ్చు,
ఆమె మదనసామ్రాజ్య పట్టాభిషిక్త
యైనరీతి హసన్ముఖయై వెలుంగు

నీవసంతాగమోన్నిద్ర నిభృతరాగ
మంజు శింజాన రమణీయ మధురగీతి
కాదు వారికి, వారు సంస్కార జడులు
వారి మోటారుహారనే వారి వీణ!

౪

కోరి మెఱుంగుసైకిల్ పై కారుపోవు
దడదడల డబడబల సిక్కుదర్పకునకు
చెవులు పాగాంతరే సురక్షితము లతని
కేమి వినపడిచచ్చు నీ ప్రేమ ఘోష.

జాఫరావల్లెకొనలు వాలేజడలు రెండు
రెండు గాలికి టపటపల్ రెపరెపలుగ
అతను విజయధ్వజమ్ము నా నతని వెనుక
సీటుపై రతి కొనరి నీపాట వినును

పాటవిని కామపరవశోత్ప్రణము లతివ
చూపు రాకెట్లతని వీపు చొచ్చి గ్రుచ్చి
దూసికొని త్రోసికొనిపోయి తుదకు బవిరి
గడ్డ మాతని దొకయింత కళవళించు

౫

అదిగో మూడు చక్రాలవాహనము స్వీయ
విశ్వరూపదర్శన జిత విష్ణుమూర్తి,
స్వాంతవాహనములు లేని జంటలకును
నరవశృంగార కేళి కాస్థానభూమి.

అతడు నారాయణుడా మహాప్రశస్త
శీధువానాధరీకృత సీరపాణి,
కలితరథచోదన క్రియా కౌశలమున
దారుకుని మాతలిని తలదన్నినాడు.

గుమ్మటమువంటి రిక్షా
విమ్ముగ నిఱుకుకొని రతియునించు విలుతుడున్
కమ్మని నీ కోకోల్వని
బమ్మెరవోవుదు రొకళ్ళపై నొక్కరుగా.

పరభృతకుహూనినాద సంభ్రమములు వార
లొక్కరా యిర్వురా యన్న చిక్కుపుట్టు,
పరభృతకుహూనినాద విభ్రముడు సూతు
డేకచక్రమ్ముపై సివమెత్తి యూగు.

౬

ఏలోకమ్మునుండి వచ్చితివో నీ
వెందుందువో గాన వి
ద్యాలాలిత్యకళా ప్రపంచ మెటు సా
ధ్యమ్మయ్యెనో నీయెడన్
త్రైలోక్య ప్రణయ ప్రసాద రచనా
త్రయ్యంతముల్ నీ మహా
లీలల్ మానసమోహనమ్ములు గదా
లీలా శకుంత ప్రభూ!

ఒకరాగ మ్మొకపాటగా బ్రదుకు బా
టొక్కింతయున్ దాట కం
గక సుశ్యామల కోమల ప్రభల న
ద్యాటన్ తలంపింతు వీ
వొక పల్కొక్కొకరమ్ము నొక్కనతిగా
మూర్ధన్యలాంగప్రదీ
ప్తి కలావ ప్రతిపాలితాఖిల జగ
ద్వీథిన్ రఘూత్తంసమున్.

# సరిహద్దులు

శ్రీ అంగర సూర్యారావు

**పాత్రలు:**

| | |
|---|---|
| లచ్చన్న | నారాయుడు |
| వెంకన్న | రుద్రయ్య |
| రాముడు | రాజయ్య |
| చిన్నయ్య | పెద్దయ్య |
| చంద్రమ్మ | |

(తెలతెలవారుతూవుంది దూరాన్నుంచి మేలుకొలుపుపాట శ్రావ్యంగా విని పిస్తోంది

* "... తెల్లవారావచ్చె తెలియాక నాసామి
మళ్ళీ పరున్నావు లే-రా!
వేణునాదాము వీని వేగ పర్వేసివస్తి
వేళాకోళమేల - లే - రా!"

మసక వెలుతురులో రంగస్థలం అస్పష్టంగా-స్వప్నంలోని దృశ్యంలా-కనిపిస్తూవుంది ఒక పంటపొలం - పొలం మధ్య ఒక పెద్ద గట్టువుంది. పొలాన్ని - ఆగట్టు - రెండు భాగా లుగా విభజిస్తోంది. దూరాన్ని గట్టుకు యిరువైపులా రెండు గడ్డిమేట్లు - మసక వెలుగులో కొండలలా కనిపిస్తున్నై. కథ జరుగుతూవుండగా రంగస్థలం మీదికి క్రమంగా ఉదయకాంతి వస్తూ వుంటుంది. ఎడమవైపు గడ్డిమేటుకు చేరబడి వెంకన్న కునుకుపాట్లు పడుతూ వుంటాడు పాట దూరంగాపోయి గాలిలో కలిసిపోతుంది.)

వెంక : (కళ్ళు తెరిచిచూసి భయంతో) ఓరి దేవుడా! అప్పుడే తెల్లారి పోయింది!

లచ్చ : (నేపథ్యంలో) ఒరేయ్ వెంకన్నా!

వెంక (ఉలిక్కిపడి లేచి నుంచుని) యిక్కడే వున్నాను బాబయ్యా!

(లచ్చన్న ఎడమవైపునుంచి వస్తాడు మోకాళ్ల వరకూ పంచె మొత్తికట్టాడు లావుగా పొట్టిగా వున్నాడు తలపాగావుంది భుజం మీద తువాలు వేసుకున్నాడు కళ్ళు రక్తాల రంగుగా వున్నాయి — వేషాన్నిబట్టి 'పెద్ద రైతు' అని తెలుస్తూ వుంది)

లచ్చ : జాగర్తగా యిక్కడ కాపలా వుండరా యెవరా అంటే నిద్రపోతున్నావంట్రా?

వెంక లేదు బాబయ్యా! తెల్లవార్లూ మేలుకొనే వున్నాను వాకంతంలో పూసిరి వున్నంతదాకా (గట్టుకేసి చూపిస్తూ) ఆ అడ్డుదాటి కొమ్మ దెవ్వణ్ణీయిటా యిటలికి రానియ్యను.

లచ్చ (కోపంతో) ఆ దొంగలంతా రొంక మా అయ్యోదగ్గిర పాలి కాపులు ఆక్లేచేప్పుడు కొమ్మలు విరిచిపోయినా గింజైనా పడ్డిగా పోదు కాలవ పాదల్ని ఒక్క నీటిచుక్క కూడా దొరకనివ్వను.

వెంక అన్ని రాత్రంతా తిరుగుతానే వున్నారండి.

లచ్చ ఒరేయ్ వెంకన్నా! తిరగడమే కాదురా! ఆళ్ళంతా యిరియ్యోళ్ళ నా మీదికి రాడా నికి తయారుగా వున్నారు.

వెంక : నిక్కటూరివాలం ఒకప్పుడు తమరిపేరు ఇనితే చుట్టుపట్ల కూడూళ్ళదాకా పాడిల్ యీ రొయ్యోర్ల కోజా లొచ్చిం దగ్గిరున్నంచీ ప్రతివోడూ తల్లి కొడుకులాగ విర్ర వీగుతు న్నాయన్నారు. విదేళ్ళకిముందు లచ్చన్న గొప్ప పేరువచ్చే దిశలు తెల్లారేయి.

# సరిహద్దులు

లచ్చి: సుబ్బయ్యగారి మైనరుగారూ!

వెంక: అవశ్యం బాబయ్యా!

లచ్చి: తెగమిడిసి పడేవాడు యెవడు! నానేను అలో చించేను.—యీడి పొగరిలా ఇక్కడని మన మూల్లకుందని—ఆడి పైరు పేలోకి ఒక రాత్రి కాడ తోలించేను. ఒక యేడాదిలో దివాలా తీసేవాడు పొలం తిణఖా పెట్టేవాడు

వెంక: యిప్పుడు జనం తెలివి మీరి పోయేరు బాబయ్యా! యీళ్ళకి భయం భక్తిలేవు

లచ్చి (మీసం మెలేస్తూ) మన సంగతి యీ దెబ్బతో తెలిసి పోతాది—యిరేళ్ళి సరద్దు దాటేసి కాలవ తెగ్గొట్టేస్తానంటున్నాడంట

వెంక (ఆశ్చర్యంతో) ఆ మాట అన్నాడేటండీ!

లచ్చి నారాయుడు.

వెంక ఆ గట్టు దాటిన గాడిద కొడుకుని పట్టుకుని మోకన్నరగొట్టి వరికి పారేస్తామండి

లచ్చి మనం అనుకున్నట్టు రేగు యవ్వారం రంగు మారతంది పల్లపుపొలాలోళ్ళంతా యేకమై పోయేరు. మనం యిరవై నాలుగంటలూ కాసు కుని వుండాలి

వెంక: యిక్కడ్నించి అడుగు కదపటంలేదు బాబయ్యా!

లచ్చి యీ గట్టు కాపలా కాయడం నీ వొక్కడివల్లా అవ్వదు. యెవడైనా గట్టుదగ్గిర కొచ్చేడో యెంటనే రుద్రయ్యగాణ్ణి పిలు (ఎడమవైపు తిరిగి బిగ్గరగా పొలికేక వేస్తాడు) ఓ రు ద్రయ్యా!

రుద్ర (దూరాన్నించి) ఓ హోయ్!

[మధ్యాహ్నంలో రుద్రయ్య ఎడమవైపునుంచి ఆయాసంగా వచ్చి నిల్చుంటాడు పెద్ద గిరజాలతల పొడవుగా వున్నాడు తంపులు తిరిగిన దండలు. మోకాళ్ళవరకూ పంచె, బనీను కోరమీసం పైకి మెలితిరిగివుంది చేతిలో కర్రవుంది)

రుద్ర (వస్తూనే బిగరగా) యెవడు? గట్టుదాటిన యెవడ యెవడంట!! (చుట్టూ చూస్తాడు)

లచ్చి: యింకా యెవడూ దాటలేదులే! (రుద్రయ్య వీపు తట్టుతూ) ఒరేయ్ రుద్రయ్యా! నువ్వు జాగర్తగా వుండాలి. ఆళ్ళంతా కూడబలుక్కున్నారని తెలిసింది యిరేళ్ళి గట్టు దాటేస్తారంట.

వెంక యెవడైనా గట్టుదాటడానికి వచ్చేడో యెంటనే నిన్ను పిలుస్తాను.

రుద్ర: నీ కేక యినగానే కాకిలా వాల్తానిక్కడ.

లచ్చి దాలిగొట్టి చెవులుమూసెయ్ ఎవొస్తే పదోందలు ఖర్చుపెడతాను నీకేం భయంలేదు

రుద్ర (హుంకరించి) నాకా భయం! ఆ యెదవలకింకా నా సంగతి తెలవనంలేదు

వెంక: పులిగొర్రెగాడి కొడుకికి ఆర్నెల్లా జైలు కెళ్ళొచ్చేవ్ — నీ సంగతి తెలీకపోడ మేట్రా!

రుద్ర యీ దెబ్బతో పూర్తిగా తెలిసిపోవాల్నా సంగతి

లచ్చి ఒరేయ్ రుద్రయ్యా! నువ్వుమాత్రం తోడ కాలవని ఒక కంట కనిపెడూవుండాలి మన కతంతా దాన్తోవుంది

రుద్ర: నేనిక్కడే కూర్చుంటున్నాను.

లచ్చి పద! పద! అక్కడికి యెల్లిపో! (వెంకన్న వైపు తిరిగి) ఒరేయ్ యెంకన్నా! నువ్విక్క డ్నించి కదలకు.

వెంక అలాగే బాబయ్యా!

రుద్ర యీ మద్దిని మన సేతులికి పనిలేక దురదలు పట్టే స్తున్నాయి (ఎడమవైపు వెళ్ళిపోతాడు)

లచ్చి నేను పైపాలంలో వుంటాను. అవసరమొస్తే పిలు!

వెంక: అలాగే బాబయ్యా!

(లచ్చన్న ఎడమవైపు వెళ్ళిపోతాడు. వెంకన్న గట్టు దగ్గరనుంచి ఎడమ చివరివరకూ తిరుగుతూ వుంటాడు. వెంకన్న ఎడమవైపు తిరిగి వున్న సమయంలో కుడి చివర నారాయుడు కనిపి స్తాడు రెండడుగులు ముందుకు వేస్తాడు. వెంకన్న అకస్మాత్తుగా తిరిగి చూస్తాడు.)

వెంక: (బిగ్గరగా) ఆగక్కడ! గట్టుదాటేవో నీ తల కాయ నీది కాదు.

నారాయణు (నిర్లక్ష్యంగా నవ్వి) ఎందుకురా యెంకన్నా అలా ఉలిక్కిపడతావ్?

వెంక ఒరేయ్ నారాయుడూ! మన సుట్టరికాలు ఇక్కడ కాదు ఇంటికాడ.

నార (ముందుకు వచ్చి చేతికర్ర గట్టు మీద ఆని) నేను నా నేలలో నా అద్దులో నిలబడి మాట్టాడుతున్నాను

వెంక: నీ అద్దులో నువ్వుంటే గొడవేలేదు అద్దు దాటి లేవి పెడి.

నారా నువ్వే నాయం సెప్పరా యెంకన్నా, బోదకాలవకి అడ్డెయ్యడం నాయమా?

వెంక అదంతా నాకుతెల్దు నేను తెలుసుకున్నా వాల్లే నాకిలాగ్గి పెద్దరికం సెత్తే అది సెయ్యాలి

నారా: నాయంతో నాకేం పనేవంటావా?

వెంక నాయమో, అన్యాయమో తీర్పు సెప్పడానికి పూళ్ళో పెద్దమనుసులున్నారు.

నారా వూరి పెద్దల్లో నీకుంటే ఇన్ని తగాదాలు, పేచీలు ఎందుకొస్తాయ్‌రా యెర్రోడా!

వెంక నువ్వు సెప్పింది నిజమే, అయినా యీ గొడవలో నేనేం సెయ్యలేను.

నారా దేవుడు కల్లెందుకిచ్చేడు? మంచిదారిలో నడానికి బుద్ధి ఎందుకిచ్చేడు? మంగిపనులు సెయ్యడానికి

వెంక వచ్చేం సెయ్యమంటా విప్పుడు?

నారా ఏం సెయ్యొద్దు నాల్రోజులపాటు పొలం లోకి రాడం మానెయ్ మా పని మేం సూసుకుంటాం

వెంక లచ్చన్నగారి నౌకరీలో వున్నంతకాలం నేను ఆ పని సస్తే సెయ్యను

నారా యెంకన్న బావా! మరోమాటు ఆలోసించు నువ్వూ పిల్లలు గలోడివి

వెంక నువ్వెంత సెప్పినా నేను యిన్నా.

నారా: లచ్చన్న తన పొలంలోంచొస్తున్న బోదకాలవకి గట్టేసేడు మా పొలాల్లోకి ఒక నీటి సుక్కైనా రాకుండా సేసేడు తను పెద్ద రైతు తన పొలానికి ముందు నీరెట్టుకో మన్నాం తనపొలం తడిసేక మా నేలకి నీరొదల మన్నాం. రొదలపంట పైగా తనపెరువుకి నీరు పెట్టుకుంటాడంట పిల్లా మేకల్తో మేం బీకొ్ళిమంతా యేమైపోవాలి? మా చిన్న మడి పండక్క రేదా? మాకు కలకోడానికి కుడ్డ లేకపోతే మానె తిండానికి తిండైనా వద్దా?

వెంక (బాధగా) నేనేం సెయ్యలేను నారాయుడూ!

నారా నువ్వేం సెయ్యొద్దు తప్పతో నువ్వు నాకాకవలసిరోడివి గనక యింత సెబుతన్నాను నువ్వు తప్పుకుంటే పాలు మేం గట్టు తెగ్గొట్టిస్తాం మా నేలు తడుపుకుంటాం

వెంక (తీవ్రంగా) నా గొంతులో పూపిరున్నంత దాకా ఆపని జరగదు

(కుడివైపునుంచి రాముడు వస్తాడు వయస్సు 20 సంవత్సరాలు నూనూగు మీసం, ముల్లుకోక్క, బంచెకట్టూ, చేతిలో కర్రా, ఉంగరాలు తిరిగి చిందరవందరగావున్న నల్లటి జుత్తు-ముఖంలో ఉద్రేకం, దురుసుతనం కనిపిస్తూ ఉంటాయి)

రాముడు (వస్తూనే నారాయుడుతో) ఒరేయ్ బావా! నీకు బుద్ధిలేదురా, యీల్లతో మళ్ళీ రాజీ బేరాలకొచ్చేవా?

నారా మరోమాటు సెప్పిసూడాలని ఏమన్నా ఇంటాడేమో అనుకున్నాను.

రాము నీ యెర్రికాని ఆళ్ళు నోటిమాటల్తో యినర్రా బావా!

వెంక! (రాముడుతో) ఒరే రాముడూ! బొడ్డూడని కుర్రోడువు! నీకెందుకురా యీ గొడవలు!

రాము (తీవ్రంగా) యెంకన్న మావా! మీరు సేసే అన్యాయాలు మా కెల్లకుర్రడిక్కూడా తెలుస్తాయి. కాకి తెలగా ఉందని నువ్వెంత సెప్పినా సిన్నకుర్రోడుకూడా ఒప్పుకోడు.

నారా ఆ కరువురోజుమాటు కర్పితంగా లచ్చన్న కాపుని విలవిప అనుకుతాను ఒప్పుకుంటాడా! సరేసరి! లేవా.

రాము: (మధ్యలో అందుకొని విరగా) ఒప్పుకోడు. తగినబుద్ధి సెప్పేదాకా ఒప్పుకోడు. యేదాది

కలం మన పొలం పదిగజాలు కలిపేసుకున్నాడు రాత్రికి రాత్రి సరిహద్దులు మార్చేశాడు. అంత అన్యాయం చేసినా మనం అప్పుడు నోరెత్తలేకపోయాం.

నారా తీర్పు చెప్పే పెద్దమనుషులుకూడా అన్యాయానికి ఒడిగట్టేరు

రాము వెంకన్నమామా! యిప్పుడైనా తెలుసుకో! మీ పెద్దరైతులకోసం తెల్సిపోయినై యింక ఆ ఆటలు సాగవ్. చిన్నరైతులమంతా యేకమై పోయాం. సరిహద్దులు చెరిపేశాం ఉమ్మడి వ్యవసాయం చేసుకుంటున్నాం

నారా యీమాటు నష్టమొచ్చినా కష్టమొచ్చినా ఒకడికి రాదు అందరికీ వస్తాది. అందరూ ఒకటేనీ నిలబడతారు

రాము మీ లచ్చన్నలాంటి పెద్దరైతులు అందరూ వచ్చినా యేం జంకం. ఒక మాటమీద నిలబడతాం

నారా వెంకన్న మామా! నువ్వుకూడా యెంతకాలం గోడలోయిగకట్టుకుంటావ్? రా! మాతో కలిసిపోయి వ్యవసాయం చేసుకో. మాతోపాటు కలో గంజో తాగు యీ రక్తంకూటికి ఆశపడకు.

వెంక ఒరేయ్ నారాయుడూ! నీపాటి నాకు తెల్దను కోకు యీనాకిరి చేను వురుత్తున్నదికాదు. మాతాత ముత్తాతలదగ్గర్నుంచి వస్తోంది

రాము మీతాత ముత్తాత లిలాగున్నారని నువ్వూ అలాగే వుండామనుకుంటున్నావా? నీ బతుకు ఆళ్లకంటే కొంచెమైనా మెరుగ్గా వుండొద్దా?

వెంక యీ బతుకిలాగ ఎల్లిపోతే చాలురా రాముడూ!

నారా వెంకన్న మామా! మరోమాటు చెబుతున్నాను నామాట విను రెండ్రోజులపాటు మళ్ళీ పని మానేసి యింట్లో కూర్చో నీలాంటి మంచోడు యిలాంటిగోడవలో చిక్కుకోవడం నాకిష్టం లేదు. అందుకని యింత చెబుతున్నాను.

వెంక నువ్వెంతచెప్పినా నావని నేను మాన్ను. మా రైతు యేంచెప్తే అదే చెయ్యాలినేను. యీగట్టు కాపలా కాయమన్నాడు. అదే చేస్తున్నాను.

రాము : (కోపంతో) ఒరేయ్ బావా! యిక నోటి మాటల్తో పనులవ్వవురా! (బిగ్గరగా) యిదిగో! యెంకన్నా చెబుతున్నాను తెల్లవారేసరికి మా చేసినగట్టు అతోజా మబద్దస్తీగా తెగ్గొట్టేస్తాం యేమౌతుందో చూస్తాం

రుద్రయ్య : (బిగ్గరగా కేకలేస్తూ ప్రవేశిస్తాడు) ఒరేయ్! ఒరేయ్! యెవడ్రా అక్కడ గట్టు తెగేసే మొనగాడెవడ్రా అంట! (ముందుకు ఒక్క దూకుదూకి పొలం గట్టుమీద చేతికర్రతో ఒక్కటి కొడతాడు)

రాము (గట్టు సమీపించి కోపంతో) ఔర్రా!

రుద్ర ఒరేయ్! నీకు భూమిమీద మీసం వుంటే గట్టు దాటరా చెబ్తాను.

రాము : ఇవ్వాళ నువ్వో నేనో తేలిపోవాలి
(రాముడు బిరబిరా గట్టు దాటబోతాడు. నారాయుడు రాముణ్ణి రెండుచేతుల్తో పట్టుకొని వెనక్కి లాగేస్తాడు)

రుద్ర ఒరేయ్! మీరింద్రకొడుకులిద్దరూ యేకమై కాలుకట్టు తెగ్గొడదామనుకున్నార్రా! (సగర్వంగా) జాగర్త! యీ రుద్రయ్యగారు యిక్కడున్నాడని జ్ఞాపకం వుంచుకోండి

నారా : (కోపంతో) యేంరా వూరుకునేకొద్దీ తెగ మిడిసిపడుతున్నావ్?

రుద్ర : ఒరేయ్ గట్టుదాట్రా! నీ తలకాయ తియ్యక పోతే నా పేరు రుద్రిగాడు కాదు.
(నారాయుడు, రుద్రయ్య సరిహద్దుకు యిరువైపులా దగ్గరగా నిలబడతారు)

నారా ఒరేయ్ యెదవా! న్యాయంకోసం ఆలోచిస్తున్నాంరా యేం గట్టుదాటడం కానిలేదాలంట్రా? చెవంపట్టదు.

రుద్ర : ఒరేయ్ 'నేను ప్రతిజ్ఞ చేస్తున్నాన్రా' అడ్డు దాటిన యెవడికి తలకాయతీసి బావిలో వేస్తాను.

(పడమరవైపునుంచి కొందరగా చిన్నయ్య, పెద్దయ్య ప్రవేశిస్తారు. యిద్దరి చేతుల్లోనూ

# సరిహద్దులు

చిన్న : యింక పూరాకోడానికి యీళ్లేదు

రాము : యీ రోజుతో తేల్చేద్దాం

నారా : వెంకన్న బావా! ఆలోచించుకో! సుబ్బి బురదలోంచి తప్పుకో!

(రాముడూ, నారాయుడూ చిన్నయ్య, పెద్దయ్య కడివైపు నిష్క్రమిస్తారు. పస్తంకుటని జరిపి నట్లయ్యింది. అంతా నిశ్శబ్దం. వెంకన్న ఒక్కడూ దిగులుగా యేదో ఆలోచిస్తూ అటూ యిటూ తిరుగుతున్నాడు. ఆ ప్రశాంతతను చీల్చుకొని దూరాన్నుంచి పాట వినిపిస్తోంది

* ఓ ఓబులేసుని కొండల నడుమ
గుద్దులతో తే ముద్దుల కరిది
దాప పెద్దుకు దర్పి కొడుకురా ఓ "

గుద్దుల ముచ్చట్లన్నీ వినిపిస్తుంది "ఒరేయ్! గులకటిదా నొక్క పెయ్యరా!" "దాప పెద్ద కోటి పాడు." "ఓ ఓసి పిల్లయ్యా! అగిరలెలా వెళ్లిందరా!"—అని కేకలు విని పిస్తూ వుంటాయి — ఒక చేత్తో అన్నంముంత పట్టుకొని ఓయ్యారంగా ఎడమవైపు నుంచి చంద్రమ్మ వస్తుంది వయస్సు 16 సంవత్స రాలు. జుత్తు చిందరవందరగా ముఖంమీద పడుతోంది. ముఖంలో చురుకుతనం కనిపి స్తోంది పరికిణీ, ఓణీ, జాకెట్టు వేసుకొంది).

చంద్ర : (వస్తూనే) ఒరేయ్ అయ్యా! నే వొస్తుంటే కేం దారిలో కేం

వెంక : (ఆశ్చర్యంతో) యేమయ్యిందే తల్లీ?

చంద్ర : ఆ కొండసామ్మిగాళ్లేదూ?

వెంక : (కోపంతో) యేం! యేం చేశాడు?

చంద్ర : అబ్బో-కేం దుర్గుచ్చిపోట్టి తో ర వాడు

వెంక : (నవ్వుతూ) అంతేనా!

చంద్ర : అప్పుడా ఆంబోతు యేం చేసింది తెలుసా అయ్యా! ముంగు కాళ్లు రెండూ పైకెత్తేసి అగావు తీసేసింది. అడ్డొచ్చిన పిట్టల్నీ, పుట్టల్నీ తొక్కేసింది.

వెంక : కొండెదవ ఆ కొండిగాడు కనేయున్న అలాంటివన్నీ.

చంద్ర : అప్పుడేం చేసి పడుకున్నావ్. పొలంగట్టు పొడిచేసి పుంతలోంచొచ్చేసు

వెంక : అంగుళం ఆల్పింగా వొదిలేస్ పోస్తే అయ్య! చుట్టు తిరిగి రాకపోతే మంచి దయింది

చంద్ర : (ముంత తండ్రి చేతికిస్తూ) ఒరేయ్ అయ్యా! యెరొయ్య? సల్లకూటిలో! దూరగాయ ముక్క వేగురా కొమటమ్మ కొట్టుకొచ్చేసింది

వెంక : (ముంత తీసుకొని) పొన్లే, నీవు పద్దెకూడు తినొచ్చేదాకా యిక్కడే కూచో యీగట్టు వేసి చూస్తా వుండు

చంద్ర : గట్టు కేసి చూడ్డం దేనికిరా అయ్యా! అదొక్కడికైనా పారిపోతా దేంటి?

వెంక : నీకు తెల్దులే, అది ఆళ్లకి మనకీ అడ్డు దేనిక్కడికి కదలకుండా చూడ్సా

(వెంకన్న ముంత తీసుకొని ఎడమవైపు వెళ్ళి పోతాడు. చంద్రమ్మ చుట్టూచూస్తూ యేం తోచక అటూ యిటూ తిరుగుతుంది కోకిలను అనుకరిస్తూ "కోయ్ కోయ్ " అని కూత కూస్తుంది తనలో తను నవ్వుకుంటుంది. తర్వాత హుషారుతో పాట పాడుతూ వుంటుంది )

చంద్ర : (పాట) ఇరుకు వనిలో దూరి బుసలుకొట్టింది
పాకుతూ కోయిలా పరుగులెత్తింది
ఆడుతూ ఆ నెమలి అలిసిపోయింది
నవ్వుతూ మా అయ్య బుజ్జగిస్తాడు

(పాట మధ్యలో కుడివైపు నుంచి పెద్దయ్యగా రాముడు ప్రవేశిస్తాడు. చేతికర్రమీద గడ్డం ఆని చంద్రమ్మకేసి కొంటెచూపులు చూస్తూ వుంటాడు)

చంద్ర : (రాముణ్ణి చూడగానే) యేరోయ్, రాముడూ అటువంటోళ్లకి బోళ్లా పెంకం అలా పెట్టు కున్నావేం?

రాము : (కోపాన్ని నటిస్తూ) ఏయ్ పిల్లా! నువ్వు నాతో మాట్లాడకు.

చంద్ర : (వెంటనే) నీతో మాట్లాడకపోతే నాకేం నష్టమా?

రాము : మా బాబుకీ మాకూ పెట్టి మంచి పాకంలో పడింది. తెల్సిందా?

రాము: (ఉత్సాహంతో) దొరికి పోయేవ్! మళ్ళీ ఓడిపోయేవ్!

చంద్ర: రెండుసార్లు మర్చిపోతే ఒకసారి నే నోడిపోయాను

(ఇద్దరూ ఒక్కసారి నవ్వుతారు—ఎపుడు చివర చంద్రబింబం కనిపిస్తాడం యిద్దరూ అతని చూసేరు చంద్రబింబం తొంగి ఒకసారి పలకరించి—చేతిక్ర హాపుచేసి—మెల్లిగా గడ్డిమేటు వెనక్కివెళ్లి దాక్కుంటాడు.)

రాము: చంద్రీ!

చంద్ర: యేరా మామా! అలా చూస్తున్నావ్?

రాము: అబ్బెబ్బే యేం లేదు! రేపు పొద్దుపొడిచే సరికి వస్తానని మాటిచ్చి.

చంద్ర: నే నెందుకు రావాలి?

రాము: (కుడివైపు చూపిస్తూ) అదుగో! ఆ తాటితోపు యెనకాల జాంతోట వుంది కూడా!

చంద్ర: చూశాను.

రాము: ఆ తోటని మా చిన్నతాత కౌలుకి పుచ్చుకున్నాడు రేపొద్దుటే అక్కడికెళ్లాం

చంద్ర: (ఉత్సాహంతో) ఓ! అయితే వస్తాను

(మెల్లమెల్లగా వెలుగు తగ్గుతుంది ముందు చీకటి కనిపిస్తుంది. తరవాత ఉదయం కనిపిస్తుంది.)

రాము: (ఆకాశంకేసి చూస్తూ) చూసేవా చంద్రీ! ఆకాశమంతా మసిపూసినట్టు యెంత నల్లగావుంది.

చంద్ర: యిలాంటప్పుడు వానొస్తే—బలే సరదాగా వుంటాది

రాము: అదుగో! అప్పుడే గాలిదుమారం మొదలయ్యింది మబ్బులు దూదిపింజలలా చెదిరిపోతున్నాయ్. వాన కురిసేయోగం లేదు. (నిరాశగా కుడివైపు చూస్తూ) ఆ పిలన్నీ నిజ లేక యెలా గెంతిపోతున్నాయో చూడు! (ఆకస్మికంగా జ్ఞప్తికి వచ్చినట్లు) అరెరే, మా అద్దా దాచేసి! చంద్రీ! తెరిచి పోతాన్లే! (అక్కడే కుడివైపు వెళుతూవుంటాడు)

చంద్ర: (అతని చెయ్యి పట్టుకొని ఆపుచేసి) అద్దాలు మా అయ్యకీ మా అయ్యకిని నీకూ నాకూ అద్దు లెంటి! యిక్కడే వుండు కన్నీళ్లు తెచ్చి పెడతాను (ఎడమవైపు వెళ్లిపోతుంది)

రాము: (ఆమె చెయ్యి పట్టుకొని) అదేంటో చెప్పు.

చంద్ర: నే చెప్పను

రాము: నువ్వు చెప్పకపోతే నేను పోనివ్వను

చంద్ర: అయితే నువ్వు చెప్పుకో చూద్దాం

రాము: పకోడీ

చంద్ర: కాదు

రాము: కొటికాయి

చంద్ర: ఊహూఁ!

రాము: కొరపెండ్లంగుంప.

చంద్ర: అదీ కాదు

రాము: మరింకేంటి చెప్పు!

చంద్ర: (అతని చెయ్యి విడిపించుకొని కిలకిల నవ్వుతూ) నువ్వు చెప్పుకోలేకపోయేవు యీలి మొప్పు పిటికెలో తస్తాను.

(చంద్రమ్మ ఎడమవైపు పరుగెత్తుకుపోతుంది రాముడు ఆమె పోతున్నవైపు పరవశత్వంతో చూస్తూ వుంటాడు గడ్డిమేటు వెనకనుంచి గొంద్రయ్య మెల్లమెల్లగా ముందుకు వస్తాడు)

గొంద్ర: (ఒక్కడూ చూసి) ఇంకెక్కడికి పోతావ్ రా యెదవా! (కర్ర రెండు చేతులతో పైకెత్తి రాముడి బుర్రమీద కొట్టబోతాడు)

రాము: (బిగ్గరగా) ఓ రి బాబో! చచ్చిపోయాన్రా! (కూలబడిపోతాడు తల, ముఖం రక్తంతో తడిసిపోతాయి)

గొంద్ర: (బిగ్గరగా) ఒరేయ్! అద్దు దాటిన యెదవని కైమా చేసేస్తాన్రా

(మళ్ళీ కర్ర పైకెత్తాడు—అకాంతంగా కుడివైపునుంచి నారాయుడు, ఎడమవైపునుంచి వంకన్న కర్రలు తీసుకొని వస్తారు.)

నారా: (ముందుకు దూకి) ఆగరా! ఆగరా గొంద్రిగా! యియ్యేళ్లతో నువ్వ కదుపు

(నారాయుడు కర్ర యెత్తుతాడు. రాముడు కూడా వెంటనే లేచిపోయి కర్ర పైకెత్తుతాడు)

గొంద్ర: (కర్ర పైకెత్తి) ఒరేయ్! యెంకన్నా! ఊఁ! కొట్రా! కొట్రా! ఆలోచింగకు

("తిన్నరా తిన్ను" "పాతెయ్యరా! పాతెయ్యి" అంటూ విరావేశంతో కేకలు వేస్తూ అటు ఇద్దరు ఇటు ఇద్దరూ కర్రలు యెత్తుతారు. అంతలో

(ఎదురుగా వెళ్ళిపోతూ వుంటాడు.)

లచ్చు (ఆశ్చర్యంతో) పారిపోతున్నాడురా! యెంత దగాకోరురా!!

వెంక: (బిగ్గరగా) ఒరేయ్ రాజయ్యా! ఆగు!

రాజు: (ఉలిక్కిపడి ఆగి వెనక్కి తిరిగి బిక్కు బిక్కుమంటూ చూస్తూ) యేందుకురా యేంకన్నా?

వెంక: (రాజయ్య భుజంమీద చెయ్యివేసి) నాకంతా సుత్తేయడం. పున్నమిరాటపైన కోపం పాపం చేసి యెల్లిపోతున్నావ్ (లచ్చన్నతో) బాబయ్యా! నాకుకూడా సెలవిప్పించండి పోతాను. నేను నాకోసం యిరవై బస్తాలు కొట్టలేను (నేలలో కర్రకింద పారేసి) సెలవ్ బాబయ్యా! సెలవ్!

రాజు: సరే! బాబయ్యా! సరే!

(వెంకన్న రాజయ్య ఎదురుగా వెళ్ళిపోగా)

లచ్చు: (కోపంతో పళ్ళుబిగించి) యెంతపని! యెంత దగా! యీళ్ళేం నోగులా!

రుద్ర (ఎగతాళిగా) నేనుంటేగా తమరికి భయమెందుకూ! మన పాలికాపులు యింకా పాతికమంది వున్నారు. అయ్యా నేనూ లేని రక్తాలు రోజులు కష్టిస్తాం. చూస్తూ వుండండి మన తడాఖా!

లచ్చు (ఎదురుగా చూస్తూ కంగారుగా) యేంకన్న, గాదు రాజయ్యగాదు కలిసి మన పాలేర్లతో యేటో మాట్లాడుతున్నారు.

రుద్ర: (ఎదురుగా ప్రమాదం ధ్వనితో) యీ యిద్దరు గాడిద కొడుకులూ కలిసి కొంప ముంచేశారు మన పాలికాపులందరూ ఆళ్ళ యెనకాల పోతున్నారు

లచ్చు: నువ్వు పరుగెత్తి ఆళ్ళని పిల్చుకురా

రుద్ర తమరుకూడా రండి.

లచ్చు: (బిగ్గరగా ఒక్కొక్కళ్ళ పేరుపెట్టి పిలుస్తాడు జవాబు రాదు) ఓ రి అప్పిగాయ్యా ఓ యెల్లయ్యా

రుద్ర (బిగ్గరగా) ఓ రి కొండిగ ఓ. రి.. పత్తియ్యా

(లచ్చన్న రుద్రయ్య ఎదురుగా వెళ్ళబోతూ వుంటాగా —యింతలో పెద్ద కోలాహలం విని పించి వెనక్కి తిరిగి చూస్తారు ముందు చిన్నయ్య నారాయుడు తలకి కట్టుతో రాముడు, పెద్దయ్య యింకా చాలామంది రైతులు మహా సముద్రంలా సరిహద్దు దాటేసి వస్తూ వుంటారు. అందరి చేతుల్లోను కర్రలు, గునపాలు, పారలూ వుంటాయి.)

రాము: (బిగరగా) ఒరేయ్! రుద్రిగా! రాకేరా!

రుద్ర (భయంతో పులిలాగ కోపంతో) తొందర పడకండ్రా!

చిన్న: (హేళనగా) రుద్రచ్చి!

లచ్చు (ఆశ్చర్యంతో కోపంతో) ఒరేయ్! ఒరేయ్! మీ కళ్ళల్లి నోగులా వచ్చున్నారండ్రా! (మీసం మెలేసి) మిమ్మల్ని మాకు కొగాలు కటా తప్పి, ముప్పై మొగాల కత్తు తగిలించపోతే నా పేరు లచ్చన్న కాదు. రారా! రుద్రిగా!

(లచ్చన్న, రుద్రయ్య ఎదురుగా వెళ్ళిపోతూ వుంటాగా రైతులు బిగ్గరగా కేకలు వేస్తూ సరి హద్దు దాటుతూ వుంటాగా "మాకు నీళ్ళు కావాలి!" "మా పొలాలు పండాలి!" "మా కడుపుకు తిండి కావాలి!" "మా నోటికి అడ్డేసి పోగాకొం!" "పదండ్రా! పదండి" అంటూ కేకలు వేస్తూ రైతులు ముందుకు సాగుతూ వుండగా తెర)

# స్వర్గీయ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

'కచటతపలు' 'గాలిగాలు' మొదలైనవి స్వతంత్ర రూపకాలు. 'పిల్లిటయిరింగు' మొదలయిన కొన్ని నాటకాలు విఖ్యాత ఫ్రెంచి నాటకకర్త మోలియర్ రచనలకు, విహారి లింక్ — మొదలయినవారి రచనలకు స్వతంత్ర అనుసరణలు. మరికొన్ని భాసునుంచి రూపకాలకు, మృచ్ఛకటికకు, ముద్రారాక్షసానికి స్వతంత్రమయిన అనుసరణలు. ఇవిగాక వారు ఈసప్ కథలు, టాల్‌స్టాయి కథలు కూడా కొన్ని తెలుగులోనికి అనువదించారు. వారి రచనలలో స్వతంత్ర హాస్యకథలు కూడా అసంఖ్యాకంగా ఉన్నాయి.

మొట్టమొదటగా భమిడిపాటివారి రచనలు మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారు చాలా కాలం క్రిందట నిర్వహించిన 'కళ' పత్రికలోను, ప్రత్యేకంగా తదితర పత్రికలలోను ప్రత్యక్షమైనాయి. అటుపిమ్మట 'భారతి'లో ప్రచురించిన అమూల్య హాస్య వ్యాసాలతో క్రమంగా ఆంధ్రలోకం అంతటా వారి పేరుప్రతిష్ఠలు వ్యాపించాయి. ఆనాటనుంచి మొన్న మొన్నటివరకు, తమ హాస్యరచనలద్వారా ఆయన ఆంధ్రప్రజానీకం హృదయానికి ఆహ్లాదం కలిగిస్తూనే ఉన్నారు.

## రూపక ప్రాధాన్యం

కామేశ్వరరావుగారి వాఙ్మయ జీవితానికి ముఖ్యంగా వన్నెతెచ్చినవి వారి రూపకాలు, వ్యాసాలూను. భమిడిపాటివారు నాటక రచన ఉపక్రమించే సమయానికి మనదేశంలో ఔత్సాహిక (Amateur) నాటక రచనగానీ, ఇటువంటి నాటక ప్రదర్శనగాని నటులుగాని, లేవని చెప్పవచ్చును. ఆ రోజుల్లో కామేశ్వరరావుగారి నాటకాలు, క్రమక్రమంగా కొంతకాలానికి తదితర ప్రముఖ రచయితల నాటకాలు, ఈ విధమైన రంగస్థలాభివృద్ధికి గొప్ప దోహదం కలిగించాయి.

## నాటకదర్శకత్వం

పూర్వం రోజుల్లో రాజమహేంద్రవరం ప్రభుత్వ కళాశాలవార్షికోత్సవం అంటే రాజమహేంద్రవరం నగరానికంతటికీ ఒక పెద్ద మహోత్సవం. ఆ నాడు కామేశ్వరరావుగారు కళాశాల పూర్వవిద్యార్థి. ఏటా ఉత్సవంలో తమ నూతన నాటకం ఒకటి ప్రదర్శించేవారు. దానితోపాటు ఏదో ఒక హాస్యరచనకూడా ఆ సభావేశంలో చదవడం వారికొక పరిపాటి. ప్రత్యేకంగా ఇది చూచి, విని ఆనందించడానికి బాగా [illegible] అక్కడికి వస్తూ ఉండేవారు. కామేశ్వరరావుగారు తాము రచించిన రూపకాలలో ప్రతి పదము ఉచ్చారణాభినయాది వికారాలతోసహా నటులందరికీ జాగ్రత్తగా వివరించి చెప్పేవారు. ప్రదర్శనం జరుగుతున్నంతసేపు, వెయ్యికళ్లతో రూపకంలో ప్రతి స్వల్పవిషయము ఎంతో జాగ్రత్తగా, శ్రద్ధగా పర్యవేక్షిస్తూ ఉండేవారు. ఆ సమయంలో తెరవెనక నిలబడి ఒక దివ్యదీక్షతో నాటకదర్శకత్వం నిర్వహించే ఆయన వ్యగ్రమూర్తి ఎన్నటికీ మరువరానిది! సామాన్య నటులుకూడా ఆయన దర్శకత్వంలో ఆ క్షణంలో మహానటులుగా మారిపోయేవారంటే అది అతిశయోక్తి కానేరదు!

భమిడిపాటివారు స్వయంగా నటులు. ద్విజేంద్రలాల్ రాయ్ 'చంద్రగుప్త'లో కాత్యాయనపాత్ర ఎంతో సామర్థ్యంతో నిర్వహించేవారని వినికిడి. ఇలాగే ఇంకా కొన్ని ఇంగ్లీషు నాటకాలలోకూడా ఆయన అభినయించారు. అయితే రాను రాను వారు స్వయంగా నటించడం విరమించుకొన్నారు.

## వ్యక్తి విశిష్టత

కాని ఈ నటనాశక్తి అవలోకితంగా, సహజంగా ఆయన జీవితంలో పెనవేసుకు పోయినట్లు కనిపిస్తుంది. కామేశ్వరరావుగారు ఎప్పుడు వ్యగ్రంగా ఉంటూ అనుక్షణము ఏదో విశిష్టలక్ష్యంతో జీవితయాత్ర సాగిస్తున్నట్లు కనపడేవారు. బాగా సన్నిహితులుగాని ఆయన హాస్య ప్రసంగ మాధుర్యము, ఛలోక్తులు, పరిహాసోక్తులు, వక్రోక్తులు, చమత్కృతులూ చవిచూచే అదృష్టం పట్టేదికాదు.

ఇక వీరేశలింగం హైస్కూలులో గణితపాఠం చెబుతూన్నప్పుడుకూడా కామేశ్వరరావుగారి తరగతులలో చీమ చిటుక్కుమన్న శబ్దంకూడా వినిపించేది కాదు! విద్యార్థులయెడల, వారి క్రమశిక్షణయెడల ఆయన కొంత కఠినంగా ఉండేవారు. ఆ సమయంలో విద్యార్థులకది కొంత కష్టంగా ఉన్నా అటుపిమ్మట యావజ్జీవము వారాయన శిక్షణకెంతో కృతజ్ఞులయి ఉండేవారు. నిత్య వ్యగ్రమయిన ఆ వ్యక్తి హృదయంలో అలాగ సర్వదా హాస్యస్ఫూర్తి ఆవిర్భవించడం కొంత

కేవలం తెలుగుదేశం జాతీయ జీవితానికి సంబంధించినవేనా అని భ్రమ కలిగిస్తాయి. కామేశ్వరరావుగారి అనుసరణలలోని ప్రత్యేకతవల్లే వీటికి విశేషమయిన వైశిష్ట్యం ఏర్పడింది.

ఇక ‘మృచ్ఛకటికము' వసంతసేన అనీ, ముద్రారాక్షసానికి ‘రాక్షసగ్రహణ'మనీ కొత్తపేరులు పెట్టి ఈ రెండు నాటకాలు నేటిరంగస్థలానికనుకూలంగా సంతరించారు. కొన్ని భాసనాటకాలకు కూడా చాలావరకీ పద్ధతే అవలంబించారు. కామేశ్వరరావుగారి రూపకరచనా దృక్పథం మనకీ నాటకాలలో స్పష్టంగా కన్పిస్తుంది. ఇతివృత్తామూలానువాదాలు కాకపోయినా అనువాదరచనా దృక్పథం వీటికొక విశిష్టత్వం చేకూర్చింది.

## పరిపూర్ణ జీవితం

కామేశ్వరరావుగారు ముఖ్యంగా తమ స్వతంత్ర రూపకాలవల్ల, ఇంకా ఇతర రూపకాలవల్ల, అనుపమానమయిన మన జాతీయ నాటకరంగానికి మూలపురుషులై నిలిచారు. అమూల్య హాస్యవ్యాసాలతోను, కథలతోను, ఛలోక్తులతోను, చమత్కృతులతోను, ఆధునికాంధ్రవాణికి కొన్నిట్లో నూతనాలంకృతు లర్పించారు.

అటు విశాలంగా ప్రాచ్య పాశ్చాత్యాలలో గల పారదృశ్వత్వం నిర్వహిస్తూ ఆంధ్రదేశంలో అసంఖ్యాకులయిన తమ అంతేవాసు లందరికీ చిరస్మరణీయులయినారు. వారి విద్యార్థులలోకి చెందినవారీనాడాంధ్రదేశంలో వేలాదిగా ఉన్నారంటే అది అత్యుక్తి మాత్రం కాదు.

ఉదాత్తము, కరుణార్ద్రము అయిన హాస్యసృష్టి ఉన్నవారు నూటికి కోటికి ఒక్కరు కనిపిస్తారు. ఈ దృష్టితో హాస్యరససృష్టి చేసి అజరామరులుగా వెలిగిన నిత్యదీప్తులు అంతకన్నా తక్కువ. ఇటువంటి వారి సాన్నిహిత్యంవల్ల, పారస్పరిక స్పష్టివల్ల నిత్యము భారభూతంగా సాగిపోయే జాతి జీవితం హాయిగా ఒక నిత్యలీలగా సాగిపోతుంది. కామేశ్వరరావుగారు ఇటువంటి ప్రత్యేకకోవకు చెందిన హాస్యమూర్తి!

రాజమహేంద్రవర వీథుల్లో ఒకగంధంలా సాగిపోయే ఇటువంటి మహనీయుల్ని ఈనాడస్పృశ్యులుగా చూస్తే ఆంధ్ర సారస్వత ప్రియులకు ఏదో ఒక తీరనిలోటు ఏర్పడినట్లనిపించడం సహజం — అసలు దురదృష్టమేగాని అసలు మన జాతిలో హాస్యదృష్టే చాలా తక్కువ. అందులోను హాస్యరచయితల సంఖ్య అంతకన్నా స్వల్పం. ఉన్న ఉత్తమ హాస్యరచయితలను వేళ్ళు ముడిచి లెక్కపెట్టడం ప్రారంభిస్తే, రెండుమూడు వేళ్ళు ముడిస్తే మరి వాటిలో శేషం ముడవడమే కష్టమైపోతుంది.

రాజమహేంద్రవరంలో కామేశ్వరరావుగారితో చాలాకాలం కలిసి మెలిసి తిరిగినవారికి కూడా యానలేని లోటు మరింత తీరదనే అనిపిస్తుంది. ఆ జాణ హాస్యదర్శన మాహాత్మ్యమే అట్టిది!

కాని స్వర్గీయులయిన కామేశ్వరరావుగారిప్పటికి గురజాడ, పానుగంటి, వేదం వెంకటరాయశాస్త్రిగారంటి మహామహులతో కలిసి కవన మునిగాలరాద, పరిహాసలీలమీద మనఆంధ్రజాతిమీద ఛలోక్తులు విసరుతూ తమ స్వర్గీయ జీవితాన్ని గురించి తిరిగి హాస్యధోరణి కల్పిస్తూనే అనుకుందాము! ఇంకొక విధంగా, హాస్యబ్రహ్మ మృతినిగూర్చి కందవును కున్నామంటే ఆయన హాస్యసామ్రాజ్యం మనం తిన్నగా అనుభవింపలేదన్నమాటే! అంతేకాదు! మన కసలు హాస్యదృక్పథమే అలవడలేదన్నమాట! అందుచేత స్వర్గీయ, హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావుగారికి హాసమ్ముఖంతో జేజేలర్పిస్తున్నాము.

"ఈయా సుఖలోనైనా ఆదరణలో శిక్షణంచే మళ్లీ మళ్లీ నీ దర్శనం మాకు తప్పదు మా మాదిరిగానే ఏదో ఒక వృత్తి చేసుకుని సుఖంగా యోగ్యతగా జీవించుకోక పరిస్థితులకు అనవసరపు ప్రాధాన్యత ఇచ్చి మూర్ఖత్వాలతో ఆవేశాలకు లోనై క్రూర కార్యాలకు పాల్పడిన ఫలితంగా యిక్కడికి వచ్చి, యీ హింస లన్నీ అనుభవిస్తూంటే నీలాంటి కొడుకో కూతురో ఎదుగుతున్నవాళ్లను చూచి విచారపడటంకంటే మేము చేయగలిందేమీ కనపడటంలేదు త్వరగా కలుసుకుని ఎనిమిదన్నరకి నీ విడుదల" అన్నాడు వారెన్

ఎనిమిదిన్నరకు అయిదు నిముషాల తక్కువ వుండగానే వాలుగొండ్రు పదకొండంబర్ ఖైదీ మల్లేశును జైలర్ స్వయంగా వచ్చి ఇన్‌స్పెక్టర్ గారి గదిలోకి తీసుకువెళ్లాడు. మల్లేశ్ అధికారికి నమస్కరించి ఎదురుగా నిలబడ్డాడు ఆ అయిదునిముషాల్లోనూ అతని విడుదలకు సంబంధించిన కాగితాల వ్రాతపని పూర్తయింది గోడమీద గడియారం అరగంట కొట్టగానే 'నీవు వెళ్లవచ్చు ఇకనైనా మంచిగా బ్రతుకు' అన్నాడు ఇన్‌స్పెక్టర్ అలాగే అన్నట్టు బుర్రవూపి అయనకు శాల్యూట్ చేసి బయటకు వచ్చాడు మల్లేశ్ జైలు ప్రాకారందాటి గేటు ముంగిళ్ళ రాజబాటపై నిలబడి ఏదో ఆలోచిస్తున్నాడు ఒక అరగంటసేపు ఆరుబయటగా గడిచింది ఏడుసంవత్సరాల కాలం కఠిన నిర్బంధశిక్షను అనుభవించి విముక్తుడై స్వేచ్ఛ లభించి దీక్షగా అనే ఆనందం అతని ముఖంలో ఎక్కడా ప్రస్ఫుటమవటం లేదు ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించుకోకుండానే తిన్నగా ముందుకు నడుస్తున్నాడు అంతకంతకు విడాఘుతాపం ఎక్కువవుతోంది శరీరం స్వేదప్రవాహంతో నిండిపోయింది ధోవతీ చొక్కా తడిసి ముద్దల లాగా తయారయినాయి కడుపులో మిక్కుటంగా ఆకలి బాధ కలుగుతోంది దప్పిక గొంతుకను ఎండింప చేస్తోంది బలహీనపడ్డ అతని దేహం తూలిపోతూండగా మరి యిక ముందుకు నడవలేక సమీపంలో కన్పిస్తున్న ఒక గ్రంథాలయభవనం ఎగ్గిరకు వెళ్ళాడు ముందు వాలివున్న ఆ వసారాలో ఎవరూ లేరు హాయిగా కాళ్ళు చాపుకుంటూ అక్కడ కూర్చున్నాడు. గతించిన జీవితకాలంలోని కొన్ని ముఖ్యఘట్టాలు అతని కళ్లముందు నృత్యం చేస్తున్నాయి.

## 2

వెంకటేశు, మల్లేశు—వీరిద్దరూ అన్నదమ్ములు చిన్నవాడైన మల్లేశు శైశవదశలో వుండగానే తల్లిదండ్రు లిద్దరూ గతించారు వెంకటేశు ఎంతో ప్రేమతో తన తమ్ముణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేశాడు ఉన్నత విద్యావంతుణ్ణిగా చేయాలని ప్రయత్నించాడు కాని ఆ అదృష్టం మల్లేశుకు లేకపోయింది ఎన్నితడవలు వరుసగా ప్రయత్నించినప్పటికీ, మెట్రిక్యులేషన్ అనబడే ఎన్నటికీ దాటలేని ఒక అగాధజలధిగా తయారైంది మల్లేశ్ నిస్పృహచెంది ఇక అటోఇటో పోవన్నాడు వెంకటేశు ఎంత ప్రోత్సాహపరిచినప్పటికీ ప్రయోజనం లేకపోయింది 'నేను యిటూ పనికిరాక అటూ పనికిరాక రెండిందాలా పాడైపోవటం జరుగుతుంది నాకు చదువుమీద మనసు పోవటంలేదు నేను వ్యవసాయంలో ప్రవేశించి నీకు అండగా వుంటాను. నీకు వున్న కొంత శ్రమ తగ్గుతుంది వ్యవసాయికంగా మన యిద్దరి యొక్క కృషి కలిస్తే ఫలసాయం కూడా పెరుగుతుంది' అని అంటూ వాదించాడు మల్లేశు చివరకు వెంకటేశు ఒప్పుకోక తప్పిందికాదు. మల్లేశు పొలంపని నేర్చుకోవటం ప్రారంభించాడు. ఉన్నత విద్యావంతుడై మాటామాటా నేర్చుకుని తన తమ్ముడు ఎంతో దర్జాగా ఒక పెద్ద ఆఫీసరైవుండటం కళ్లారా చూడాలని ఎన్నివిధాలుగానో ఆశలు పెంచుకున్న వెంకటేశ్, గడ్డుపరుకాలంలో ఒళ్లంతా నీరైపోతూండగా ఆయాసపడుతూ పలుగుతో తవ్వి గడ్డ విరవటం వానాకాలంలో భోగమును చూస్తూండగా గంటలకొలదీ నడుమువొంచి మొక్కలనాటటం మొదలైన శారీరకశ్రమ ఎక్కువగా అవసరమైన యిటువంటిపనులలో పాల్గొంటూన్న మల్లేశును చూచి కంట తడిపెట్టుకునేవాడు కొద్దికాలం గడిచినాక వ్యవసాయపుపనులకు సంబంధించిన కష్టమైనభాగాన్ని తానే నిర్వహించుకుంటూ ఏవేవో చిన్నచిన్న పనులమాత్రం అతనికి ప్రత్యేకించాడు ఒక సంవత్సరకాలం ఆ విధంగా గడిచింది ఇంతలో ఆ గ్రామంలో దస్తావేజుల వ్రాసిపెడుతూ పొలాల కొలిచిపెడుతూ మరి యితర ప్రయివేటుదారీ పను లన్నీకూడా నిర్వహిస్తూండే ఒకాయన మరణించటం జరిగింది. మళ్లీ ఆ పనులకు తమ గ్రామంలోనివారికే ఒకర్ని నియమించాలని

ఆలోచనలన్నీ దానిచుట్టూ విహరిస్తున్నాయ్. ఆలోచనల ఒత్తిడికి తట్టుకోలేకపోద్దీ అతని మనసుకి గట్టిబలం కలిగింది.

"అనవసరపు ఆలోచనలతో కాలం వ్యర్థపుచ్చకుండా నన్ను ఉపయోగించడమే నీ కర్తవ్యం! మరి ఎన్నటికీ అతిథులు యిలాంటి గత్యంతరం సమస్యలు తిరిగి సమర్పిన్నాము కాకుండా నన్ను నీవు కాపాడుకోవాలనుకుంటే నన్ను అతిసమీపాన ప్రయోగించు. మా మీ ప్రాంతాలలో జాతీయ పనులేగాని ఎవడి చేతిలో కూర్చుంటే వాడు చెప్పినట్లు చేయటమే నా విధి ఆలోచన నాదేది. కార్యదక్షత నాది" అని అకత్తి అన్నట్లు తోచింది అతనికి!

ఇంతకాలనుండీ ఈ పాడు జనిత లోకంలో విహరిస్తూండిన సురేష్ ను నా ప్రతిక, బంధాలేవీ యీ లోకంలో కాలాగింది. 'కాలయాపన కూడదు, అనుకున్న పని వెంటనే జరిగిపోవాలి' అని నిశ్చయించుకుని గోడదగ్గరకు వెళ్లాడు సురేష్. అతను వుపై హస్తాన్ని వుంచినపుడు కూడా అతని మనసు కొంచెం ఆలోచింపసాగిందనిపించింది. కాని అజ్ఞాన వ్యక్తతో వుడికిపోతూన్న అతని రక్తం 'కాలయాపన చేయరాదు. ఆలోచనలకు నీతిలేదు. అవి మనిషిని ఎటు పడితే అటు లాగుకొంటాయి' అని హెచ్చరించింది. వెంటనే ఆ కత్తి వ్రతిని ఒక భానుగాటి లెదర్ బేగ్ లో వుంచాడు. ఆ లెదర్ బేగ్ ని బొడ్డుదగ్గర బట్టమడతలో దాచుకుని మెల్లమెల్లిగా దిగి బజారుకు వెళ్లిపోయాడు. అప్పటికి చాలాసేపు కావటం మూలాన వెంకటేష్ ఇంటిదగ్గర జనసందడి కొంచెం తగ్గింది. వీధిగుమ్మంలో నిలబడి అప్పుడే వచ్చిన అయినవాళ్లతో పెద్దలతో మాట్లాడుతున్నాడు వెంకటేష్. ఏ దిక్కునుంచి వచ్చాడో కూడా ఎవరూ గమనించలేదు. పత్తి ఆ కత్తితో వెంకటేష్ మీద కసికి రెండు కత్తిపోట్లు వేసి పరుగెత్తిన ఆ అయినవాళ్లూ యిది హత్యప్రమాదమని అవగాహన చేసికోలేకపోయారు. వారికి కాళ్లూ చేతులు లేదు. మనసులు పనిచేయలేదు. కంఠములు పట్టుకు చూస్తున్నా దురంతం పండెల్లి తీవ్రంగా కంపింపచేస్తోంది. హంతకుడు వెంకటేష్ శరీరాన్ని ఛిద్రం చేస్తున్నాడు. రుధిర ధారలు ప్రవహిస్తున్నాయి. వాళ్ళు నిశ్చేష్టులతరహా పెద్దమనుష్యులు విశ్వష్టులై శిలాప్రతిమలవలె నిలబడిపోయారు. తిరుపతి ముంగుడు పాగివెళ్లి హంతకుడి చొక్కా పట్టుకుని యినతలకు లాగటానికి ప్రయత్నించారు. పక్షికి వేగంతో క్రూర బలంతో వూగిపోతున్న హంతకుడు వారిని ఒకచేతో ప్రక్కకు తోస్తూ మరోకచేతో తనపని పూర్తిచేసుకున్నాడు. దొక్కల్లో పడ్డ పోటుతో వెంకటేష్ నేలమీదకు ఒరిగిపోగానే కత్తి దూరంగా విసిరేసి

'ఇక మీరు శ్రమపడనక్కరలేదు. నన్ను పట్టుకుని మీ కేమీనా చేసుకోండి. నాకు ఇష్టమే' అని వారి ముందు నిలబడ్డాడు హంతకుడు. అప్పుడు గుర్తుపట్టగలిగారు హంతకుడు సురేష్ అని. రెండు నిమిషాలలో సురేష్ లోని పశ్చి ఆవేశం పూర్తిగా తగ్గిపోయింది. రక్తపు మడుగులో పడివున్న తన అన్న శరీరాన్ని ఒక తడవ కళ్లు పెద్దవి చేసుకుని చూశాడు. ఎంతో వాత్సల్య పూరితంగా 'తమ్ముడూ' అని సంబోధించే ఆనోటి నుంచి రక్తపు బొట్లు రాలుతున్నాయి. తమ కుటుంబం కొంచెం గర్భశోకంలో వున్నపుడు 'నిదానపడు తమ్ముడూ! మనకు మంచిరోజులు రాకపోవు!' అని అనునయించిన ఆ హస్తాలు చాలా గట్టిగా బిగిసి వున్నాయి. తనచేతుల ఆఖరి దశాఫలం ప్రవహింపచేసిన ఆ నేత్రాలు కాంతిహీనమై పోతున్నాయ్. తనను చిన్నప్పటి నుంచీ ఎంతో లాలించి బుజ్జగించి ప్రేమగా పెంచిన తన అన్న తన మూర్ఖత్వానికి బలియైపోయాడు. సురేష్ హృదయంలో దుఃఖ ప్రవాహం పొంగింది. 'నా అన్నను నేనే చంపుకున్నాను' అని బిగ్గరగా విలపిస్తూ ఆ రక్తపు మడుగులో దొర్లుతున్నాడు. చుట్టూ మూగివున్న పెద్దమనుష్యులకు వెంకటేష్ ఒక్క తడవ బాగా కండగొప్పలు ఉప్పొంగిన హీన కంఠస్వరంతో 'నా తమ్ముడిపై హత్యానేరం మోపకండి, యీ విషయాన్ని మరణ వాఙ్మూలంగా చెపాలనుకుంటే నాకు వ్యవధిలేకుండా పోతోంది." అని అంటూ కన్ను మూశాడు. అదే ఆఖరిమాట అయింది. తర్వాత ఒక అరగంటకు పోలీసు ఉద్యోగస్తులు వచ్చారు. వారితో సురేష్ తానే హంతకుడని ఒప్పుకుని అధికారంగా వ్రాసియిచ్చాడు. అందుకు తగినట్లుగా అక్కడవున్న పెద్ద మనుష్యుల సాక్ష్యాలు కూడా తీసుకుని సురేష్ ని బస్తీకి తీసుకువెళ్లి సబ్ జైల్ లో వుంచారు. కేసు నడుస్తున్నప్పుడు కొంతమంది స్నేహితుల ప్రోద్బలంతో సురేష్ తన మనసును మార్చుకున్నాడు. "నేను హంతకుణ్ని కాదు. యీ హత్యతో నాకు ఏ మాత్రమూ సంబంధము లేదు. పోలీసువారి హింసా కాండను భరించలేక ఆవిధంగా స్టేట్ మెంటిచ్చానని న్యాయస్థానంలో వాదించాడు. యీ కేసునుండి రక్షింపబడాలనే పట్టుదలతో తన కున్న మేడ, రెండెకరాల భూములు—యీ రెండింటినీ విక్రయించి అప్పైకం ఖర్చుపెట్టి పెద్ద పెద్ద ప్రయత్నాలు చేశాడు. ప్రసిద్ధుడైన ఒక బొంబాయి న్యాయవాదిని పిలిపించి తన పక్షాన వాదించుటకు న్యాయాధిపతుల ముందు హాజరుపర్చుకున్నాడు. చివరకు యీ ప్రయత్నాలన్నీ నిష్ప్రయోజనములైనాయి. కాని సెషన్సుకోర్టులో

# గ్రంథవిమర్శనము

## పతివ్రతా చరిత్రము

ప్రకాశకులు: గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మద్రాసు వెల రెండు రూపాయల ఇరవై ఐదు పైసలు

ఇది ద్విపదరూపంలో ఉన్న 312 పుటల ఉద్గ్రంథం. ద్విపదశ్రేణికే వన్నె తెచ్చే ఇది తెలుగులో కథాసరిత్సాగరం వంటి గ్రంథమేమోనని అనిపిస్తుంది. రచన అంతా ద్విపదలో సుసంపన్న కృతిమ, శిష్టము అయిన ప్రబంధశైలిలో సాగింది.

కథాకథనం శుకసప్తతి శుకసప్తతి ధోరణిలో నడిచిపోయింది. అయితే శుకసప్తతి కేవలం శృంగార ప్రధానమయిన కావ్యం. కాని ఇది పతివ్రతల పునీత చరిత్ర లిఖించే సుదీర్ఘ కావ్యం. ఇతిహాసాలలో పేర్కొన్నట్టి కావ్యంలో కథలు ఎన్నో కథాసరిత్సాగరము, ద్వాత్రింశత్సాలభంజిక, భోజరాజీయము మొదలయిన గ్రంథాలలో నుంచి సేకరించబడినట్లు కనబడుతున్నాయి.

అయితే ద్విపదలో ఈ విధమయిన కథాకావ్యం ఆంధ్ర వాఙ్మయంలో మరేది కనబడదు. అందువలన ఈ గ్రంథం ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో విశిష్టమయినది.

ఈ గ్రంథప్రచురణకోసం ఉపయోగించిన తాళపత్ర ప్రతులలో కవి నామధేయము, కృతికర్తలు లుప్తమైపోయాయి. ఇందుచేత ఈ గ్రంథకర్తృత్వం గాని, గ్రంథకాలం గాని నిర్ణయించడానికి వీలులేకపోయిందని సంపాదకులు తెలియజేస్తున్నారు. శిష్టము ఉదాత్తము అయిన గ్రంథశైలినిబట్టి చూస్తే గ్రంథకర్త ఇంచుమించుగా ప్రాచీన ప్రబంధకాలానికి చెందినవాడని నిర్ణయించవచ్చును. అయితే ఇది కేవలం ఊహామాత్రమే.

ఆంధ్రదేశంలో మారుమూల గ్రామాలలో కొన్ని తోట్లల్లో తాళపత్ర గ్రంథాలింకా అజ్ఞాతంగా అడుగున పడి ఉండవచ్చును. మన అదృష్టవశాత్తు అటువంటి తాళపత్ర గ్రంథాలలో ఈ పతివ్రతా చరిత్ర ప్రతి కూడా ఒకటి లభిస్తే లభించవచ్చును. పాఠకు తెలియరాని ఈ విషయంలో సహకరించగలిగితే ఆంధ్ర వాఙ్మయానికి అపూర్వమైన సేవ చేసినవారవుతారు.

ప్రస్తుత పతివ్రతా చరిత్రము కవి నామాది విషయంలోనే గాక కథలలోగూడా కొంతవరకు అసంపూర్ణంగానే ఉన్నది.

అయినా గ్రంథప్రాశస్త్యాన్ని బట్టి ఇది తప్పక ప్రకటించతగిన గ్రంథం. ప్రకాశకులు, యథాశక్తిగా విస్తృతంగా ప్రచురించిన సంపాదకులు అభినందనీయులు.

'శాస్త్రి'

* * *

## మహోదయం

### [నేపథ్యగేయ రూపకము]

రచయిత, ప్రకాశకులు: శ్రీ శివానంద తిరంగిరి ఉప్పలపల్లి రామలింగేశ్వరరావు. ముదిర వీథి కడప. వెల. రూపాయిన్నర

ఆంధ్రులలో అనైక్యం పరిహరించి ఐక్యం పెంపొందించడమే ఈ గేయ రూపకం లక్ష్యం. గోదావరీదేవి, కృష్ణాదేవి, పెన్నాదేవి, తుంగభద్రాదేవి, మంజీరాదేవి, తమ దైన్యావస్థ చాటుతూ అహంభావాలతో ఎలుగెత్తి గానం చేస్తాయి. అయితే అర్థగభీరమైన ఈ దేవుల ప్రత్యేక భావాలన్నీ తుదకు ఐక్యం చేసుకోవడానికే ప్రయత్నిస్తుంది అదియెంతగానో ఉద్బోధిస్తుంది. ఆకాశవాణి చిట్టచివరకి ఈ కర్తవ్య ప్రాంతీయాహంకారాలు మాసిపోయి ప్రత్యేకత్వం విడనాడుకొంటూ అందరు చేతులుకలిపి ఏకత్వంతో ఐకమత్యంతో మెలగాలని ప్రబోధిస్తుంది. సంగ్రహంగా ఈ రూపకంలో విషయం ఇది.

రచయిత దీనిలో పద్యాలతో బాటు ఎన్నో గేయాలు కూడా వ్రాశారు. ఈ గేయాలు, పద్యాలు భావయుక్తంగా నడిచిపోతూ మొత్తం రచనకు ఒక విశిష్టత చేకూరుస్తున్నాయి. పాఠశాలలలోను, కళాశాలలలోను, ఉత్సవములలోను, సంగ్రహంగా ఉన్న ఈ నేపథ్య రూపకం నాటకీకరించుటకు, ఆంధ్రజాతిలో అనైక్య పరిహారానికి ఎంతయినా ఉపకరింపగలదు.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambbu Prasad.**